# హిందీ—తెలుగు గ్రంథములు

విద్వాన్ A. C. కామాక్షిరావు, B. A., B. O. L.

ప్రతివారును హిందీభాషను వ్రాయుటకును, చదువుటకును, మాటాడుటకును, సులభముగ, తమకు తామే, ఒకరి సహాయము లేకయే నేర్చుకొనుటకు అనుకూలముగ వ్రాయఁబడినవి. ప్రైమరు చదివినవారు కహానియా మొదటి భాగమును, పహ్‌లీ కితాబ్ చదివినవారు కహానియా రెండవ భాగమును, దూస్‌రీ కితాబ్ చదివినవారు కహానియా మూడవ భాగమును చదువుటకు వీలుగ వ్రాయఁబడినవి.

| | | |
|---|---|---|
| రాయల హిందీ తెలుగు ప్రైమరు | ... | 0- 6-0 |
| రాయల హిందీ తెలుగు పహ్‌లీ కితాబ్ | ... | 0- 3-0 |
| రాయల హిందీ తెలుగు దూస్‌రీ కితాబ్ | ... | [illegible] 2-0 |

## రాయల హిందీ కహా

పాఠ[illegible]ల కనువగు చక్కని చిత్రపటములును చేర్చబడినవి. అంత్యమున [illegible] న పదములకు తెలుగు అర్థములు ఇవ్వబడినవి.

| | | | |
|---|---|---|---|
| మొదటి భాగము | Part I | .. | 5-0 |
| రెండవ [illegible]గము | Part II | .. | [illegible]-8-0 |
| [illegible] భాగము | [illegible] III | ... | [illegible]-8-0 |

## రా[illegible]ల హి[illegible] — తెలుగు శబ్దకోశ్

(23,00[illegible] [illegible] జాతీయము

[illegible] వ[illegible]కు [illegible] కంటె

[illegible] మూడు 60[illegible] నూతన పదములు [illegible]

[illegible] [illegible]బడినది. [illegible]-0-0

## [illegible] హిందీ కాపీ పుస్తకము

వ్రా[illegible] [illegible]రుటకు [illegible] ప్రారంభించి వరుసక్రమమున వ్రాయ[illegible] పుస్తక[illegible] 1, 2, 3 భాగములు. పుస్తకము 1-కి 0-3-0

---

రాయలు అండ్ కో., పబ్లిషర్స్, కడప.

శ్రీరస్తు

# భాస్కర శతకము

(మారద వెంకయ్య ప్రణీతము)

కావ్య పురాణ తీర్థ, విద్వాన్,
జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారిచే
టీకాతాత్పర్యము వ్రాయఁబడినది.




ప్రకాశకులు:
రాయులు అండ్ కో.,
పబ్లిషర్స్ & బుక్ సెల్లర్స్, కడప.

బ్రాంచి: - 32, నారాయణ మొదలివీధి, మద్రాసు-1

 1954 [వెల 0-10-0

# విన్నపము

సమాజశిక్షకు నీతిశాస్త్ర పరిచయము ప్రధానము. అదియు నుదాహరణ పూర్వకముగ నుండినచో మనస్సున స్థిరనివాసము నేర్పఱచుకొని లోకవృత్తమునఁ జిక్కని యశశ్చంద్రికల వ్యాపింపఁ జేయఁగలదు. ఈ భావంబును మనంబున నిడుకొనియే పెద్దలు స్త్రీ బాల వృద్ధులకుఁ బఠింప ననువుగ నుండునట్లు శతక విరచనమునకుఁ బూనుకొనిరి. శతకములలోఁ బెక్కు తరగతుల గలవు గాని భక్తి, నీతి బోధకము లగునవి మాత్రమే యెక్కువ వ్యాప్తి నందఁ గల్గినవి. ఈ శతకములలో నీతిని బోధించుటకుఁ బేరెన్నిక గన్నది యీ భాస్కర శతకము.

కవి తన కులగోత్రాదులనుగాని, దేశ కాలములనుగాని యెచ్చటను దెల్పలేదు. వాడుకను బట్టియు, గ్రంథశైలిని బట్టియు రాయలసీమకుఁ జెందినవాఁడని మాత్రము తప్పక చెప్పవలసియున్నది. రాయలసీమలో సంచరించి యిందలి వాఙ్మయమును గ్రహించిన విమర్శకు లీమాటఁ దప్పక పాటింతురు. ఖల్లూకపుఁబట్టు పట్టి వాదముఁ జేయువారు పెడమార్గముఁ ద్రొక్కినను లోపము గలుగదు. శైలిలోఁ బదముల మార్చి మండలాంతరములకు గ్రంథకర్తల నీడ్వఁగోరువారి కాత్మవిశ్వాసము నెంతఁ బుట్టించినను బెడత్రోవ మానిన భంగమని తలంతురు. ఆ మాటఁ దడవ నేల ?

నిఘంటునిర్మాణకర్తయగు C. P. బ్రౌను దొరవారు ఈ గ్రంథకర్త మారద వెంకయ్య యని నిర్ణయించినట్లు గలదు. మఱికొందఱు మారవి కవి యనియు, ఈ పదమును విఱిచి నానార్థకోశము నూఁతగఁగొని లక్ష్మీనారాయణ యనియు నిర్ణయించిరి. కాని సమంజసముగ నేరికి నీ ఫక్కి కనఁబడదు. కవి శైలినిబట్టియుఁ, బూర్వలాక్షణికుల మతమునుబట్టియు నప్పకవికంటె నితఁడు ప్రాచీనుఁ డని చెప్పవచ్చును. పదునాల్గు పదునైదు శతాబ్దులలోనివాఁ డన లోపముకాదు.

చిమ్మట, గండి, వెట్టి, పుడిసెఁడు, నిబద్ధి, నక్కబొక్క, తాటి, చిల్లవిత్తు, గొగ్గి, జతకాఁడు, ఓటిపుట్టి, బుడుంగున మొదలగు పదములు రాయలసీమయందు సాధారణముగ వాడునవి, ఉదాహరణములును, జానపదములఁ దఱచుగ నుపయోగించునవి, రాయలసీమవాస్తవ్యతను జాటుచున్నవి. ఈశతకమునఁ బద్యములు అకారాదిగ నున్నవి. ఇది యొక క్రొత్తపద్ధతి. కవి సూర్యోపాసకుఁడు కావున 'భాస్కరా' యని సంబోధించి శతకమును వ్రాసెను. మఱి

సన్నుత మద్గురుమూర్తి, శుభకారణ సన్మునిసేవ్య యను విశేషణము లుపయోగింపఁ బడినవి. మరి పద్యమునఁ గవి తన విధేయతను దెలుపుట యెంతయుఁ గొనియాడఁదగియున్నది. 59, 76, 91, 92 పద్యముల భావము లితరకవుల యనుకరణములుగాఁ గనఁబడును. అయిన నేమి, రచన సాటిలేనిది. పద్యములు గ్రాహ్యములు.

ఈ భాస్కర శతకమునందలి పద్యములు పలుమాఱులు పఠింపఁ దగినవి. కంఠపాఠముగ నేర్చుకొనఁ దగినవి యనుమాట యీ నాఁడే కాదు, ప్రాచీన కాలమునుండి వాడుకలోనికి వచ్చిన దనుటకుఁ దాఖ్కాలము పాఠశాలలయందలి పాఠ్యగ్రంథములే చాటుచున్నవి. భాస్కర శతకములోని పద్యములు లేని తెలుఁగు వాచకములుగాని, గద్యపద్య సంగ్రహము లను పేరున నుండు భాషా పాఠ్యగ్రంథములుగాని లేవనుట యతిశయోక్తి కానేరదు. ప్రతి బాలుఁడును, బాలికయును జదివి యిందలి నీతుల ననుభవపూర్వకముగ గ్రహించి ప్రవర్తించిన భావిజీవితమున లోకమునందు మిక్కిలి యశంబును సంపాదించి యెల్లరకుఁ బూజ్యు లగుదు రనుటలో నే సందియమును లేదు. విద్యార్థులేకాక స్త్రీలు, పురుషులు వయోనిర్ణయ మను భావంబులేక యీ పద్యములఁ బఠింపఁబూనుట యెంతయుఁ జేయఁదగిన కార్యములయందు ముఖ్యమయినదని చెప్పవలెను. మనదేశమున నెల్లరును నీ గ్రంథమును దాము చదువుటయే కాక విశ్రాంతిసమయముననే యన నేల, తీఱిక చేసికొని తమబిడ్డలకుఁ బాఠముగాఁ జెప్పఁ బూనుకొనినచో వారు పాఠశాలలలోఁ జదువునపుడు ప్రారంభమునుండి యున్నత పాఠశాలయందలి యుత్తమ పరీక్ష (S. S. L. C.) వఱకును నెక్కువ తోడ్పాటు చేసినవా రగుదురు. భాస్కర నామస్మరణంబున ముక్తియు, శతకమునందలి పద్యముల భావములఁగల లోకశిక్షను గమనించిన భుక్తియును నీ శతకంబు గలిగించుచున్నది. పఠింపుఁడు; భుక్తిముక్తులఁ బడయుఁడు. ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్ (ఆరోగ్యమును సూర్యుని నుండి కోరవలయును) అను పెద్దలసూక్తి ననుసరించి యాయురారోగ్య భాగ్యములఁ బాఠకులకును, ప్రకటన కర్తలకును శ్రీ భాస్కర భగవానుఁడు ప్రసాదించుఁ గాక!

శ్రీ లలితా విలాసము,
కడప

పండిత వశంవదుఁడు,
విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ.

శ్రీ సరస్వత్యై నమః

# భాస్కర శతకము

(సరళార్థ ప్రకాశినీ టీకాతాత్పర్య సహితము)



ఉ. శ్రీగల భాగ్యశాలికడఁ ♦ జేరఁగ వత్తురు తారు దారె దూ
రాగమనప్రయాసమున ♦ కాదట నోర్చియునైన, నిల్వ ను
ద్యోగము చేసి; రత్ననిల♦యుం డని కాదె? సమస్తవాహినుల్
సాగరుఁజేరు టెల్ల, ముని♦సన్నుత! మద్గురుమూర్తి! భాస్కరా!

టీ. మునిసన్నుత! - మునులచేఁ జక్కఁగాఁ బొగడఁబడినట్టియు, మద్గురుమూర్తి - నాయొక్క గురుస్వరూపుఁడవు అయినట్టియు, భాస్కరా! - సూర్యుఁడా! శ్రీగల భాగ్యశాలికడన్ - సంపదగలిగిన భాగ్యవంతునిదగ్గఱకు, దూరాగమన ప్రయాసమునకున్ - దూరమునుండి వచ్చుటవలనఁ గలిగిన శ్రమకు, ఓర్చియునైనన్ - ఓర్చుకొనియైనప్పటికిని, ఆదటన్ - ప్రేమచేత, నిల్వన్ - నివసించుటకు, ఉద్యోగముచేసి - ప్రయత్నముచేసి, తారుతారె - తమంతటతామే, చేరఁగన్ వత్తురు - చేరుటకై వత్తురు, సమస్తవాహినుల్ - సకలమయిన నదులును, సాగరున్ - సముద్రుని, రత్ననిలయుండు - మణులకు స్థానమయినవాఁడు, అని, ఎల్లన్ - అంతయును, చేరుట - ప్రవేశించుట, కాదె - కదా?

తా. భాస్కరా! సంపదగలవాని దగ్గఱకు జనులు కష్టము లెన్నియైనను బడి, శ్రమయని, దూరమని తలంపక మిగుల ప్రయత్నముచేసి చేరుదురు. నదు లన్నియు నెన్నివంకరలు తిరిగినను, నెంతశ్రమపడినను రత్నములుండువాఁ డనియే కదా సముద్రునిఁ జేరుచుండుట! ఎల్లవారును ధనవంతు నాశ్రయింతు రని భావము.

ఉ. అంగన నమ్మరాదు; తన ◆ యంకెకు రాని మహాబలాఢ్యు వే
భంగుల మాయ లొడ్డి చెఱు◆పందలపెట్టు; వివేకియైన సా
రంగధరుం బదంబులు క◆రంబులు గోయఁగఁజేసెఁ దొల్లి చి
త్రాంగి, యనేకముల్ నుడువ◆రాని కుయుక్తులు పన్ని భా.2

టీ. భాస్కరా! తన యంకెకురాని - తన స్వాధీనమునకు (తనకు లోఁబడుటకు) రానట్టి, మహా బలాఢ్యున్ - గొప్ప బలముగలవానిని గూడ, వేభంగులన్ - అనేక విధములుగా, మాయలు - మోసములు (కపటములు), ఒడ్డి - పన్ని (అల్లి), చెఱుపన్ - చెఱుచుటకు, తలపెట్టున్ - నిశ్చయించును, తలంచును, (కాఁబట్టి) అంగనన్ - ఆఁడుదానిని, నమ్మరాదు - నమ్మకూడదు, తొల్లి - పూర్వము, చిత్రాంగి - రాజరాజ నరేంద్రుని భార్యయగు చిత్రాంగి, నుడువన్ రాని - చెప్పుటకు సాధ్యముగాని, కుయుక్తులు - కపటములైన యుపాయములను, పన్ని - కల్పించి, వివేకియైన - బుద్ధిమంతుఁడగు, సారంగధరున్ - సవతికుమారుఁడగు సారంగధరుఁ డనువానిని, పదంబులు - కాళ్ళు, కరంబులు - చేతులు, కోయఁగన్ - కోసివేయునట్లు, చేసెన్ - చేసెను.

తా. భాస్కరా! ఆఁడుదానిని నమ్మరాదు. ఎంతటి బలవంతునైనను, తనకు లోఁబడనివానినైనను, అనేకవిధములయిన మాయలను జేపి లోఁబఱచుకొని, చెఱుపఁగలదు. పూర్వము చిత్రాంగి యనునది తన సవతియగు రత్నాంగి కుమారుఁడగు సారంగధరునిపై లేనిపోని నేరములు మోపి మాయచేసి రాజుచేఁ గాలుసేతులు నఱకించునట్లు చేసెను.

---

2. సారంగధరుఁడు - చిత్రాంగి.

వేఁగిదేశమునకు రాజధాని రాజమహేంద్రవరము. ఈ పురమును రాజధానిగాఁ జేసికొని పాలించిన రాజు రాజరాజనరేంద్రుఁడు. ఇతఁడు చాళుక్య వంశమువాఁడు. ఇతనికి రత్నాంగి, చిత్రాంగి అను నిరువురుభార్యలు. రత్నాంగి కుమారుఁడు సారంగధరుఁడు. చిత్రాంగి సారంగధరుని రూపమునకు మోహిత యయినది. ఒకనాఁడు సారంగధరుఁడు రాజు పట్టణమున లేని సమయమునఁ

ఉ. అక్కఱపాటువచ్చు సమ♦యంబునఁజుట్టములొక్కరొక్కరి
నక్కున నుద్ధరించుటలు♦మైత్రికిఁ జూడఁగ యుక్తమేసుమీ!
యొక్కట నీటిలో మెరక♦నోడలబండ్లును బండ్లనోడలున్
దక్కక వచ్చుచుండుట ని♦దానము గాదె తలంప? భా. ౩

టీ. భాస్కరా! అక్కఱపాటు - తగిన యవసరము, వచ్చు సమయంబునన్ - కలిగిన కాలమునందు, చుట్టములు - బంధువులు, ఒక్కరొక్కరిన్- ఒకరినొకరు, మక్కువన్ - ప్రేమతో, ఉద్ధరించుటలు - తోడుపడి కష్టములను గట్టెక్కించుటలు, మైత్రికిన్ - స్నేహమునకు, చూడఁగన్ - ఆలోచన చేయఁగా, యుక్తమే - తగినదే, సుమీ! - కదా!, ఒక్కటన్ - ఒకానొక సమయమునందు, నీటిలోన్ - నీటిమీఁద, ఓడలన్ - పడవలయందు, బండ్లున్ - బండ్లును, మెరకన్ - నేలమీఁద, బండ్లన్ - బండ్లయందు, ఓడలున్ - పడవలును, తక్కక - వదలిపెట్టక, వచ్చుచుండుట, తలంపన్ - యోజింపఁగా, నిదానము కాదె - కారణము కదా? (ఉదాహరణమగును)

తా. భాస్కరా! సమయము వచ్చినపుడు లోకములో బంధువులగువారు మిక్కిలి ప్రేమతో నొకరికొకరు తోడ్పడి కష్టమును దీర్చుటకై సిద్ధముగ నుండి కార్యములను నెఱవేర్తురు. ఇది బంధుత్వఫలము. నీటిలో బండ్లను ఓడలు మోసి గట్టుచేర్చును. మెరకయందు బండ్లు ఓడలను మోపి నీటియందుఁ

---

పావురముల నాడించుచుండఁగా నొక్క పావురము తప్పిపోయి తనకడకు రాక చిత్రాంగి మేడమీఁద వ్రాలెను. దానిని దెచ్చుకొనుటకై సారంగధరుఁడు చిత్రాంగి మేడకుఁ బోయెను. తాను మోహించియున్నవాఁడు తనమేడకు వచ్చెనని సంతసించి యాతనితో సుఖింపఁగోరి చేయిపట్టుకొని చిత్రాంగి బలవంతపెట్టెను. ధర్మమును దెలిసినవాఁడును, బుద్ధిమంతుఁడును నగు సారంగధరుఁడు నీతుల నెన్నింటినో తెల్పి యామెచేతిని విడిపించుకొని మేడనుండి పాఱిపోయి తన భవనమును జేరెను. చిత్రాంగి సాహసముతో సారంగధరునిపైఁ బగఁ బూని రాజు రాఁగానే లేనిపోని నేరములను గల్పించి చెప్పి, రాజుతో సారంగధరుని కాళ్ళుచేతులను నఱికించెను. కాఁబట్టి అంగన నమ్మరాదు; చాడీలు కల్పించి హానిగల్గించునని నీతి.

జేర్చును. ఇది యెల్లరకును ఉదాహరణముగా నున్నది. ఒకరికొకరు తోడ్పడుట బంధువుల లక్షణము.

చ. అడిగినయట్టి యాచకుల ♦ యాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొ ♦ కానొకయప్పుడు నీదు వాని కె
య్యెడల; నదెట్లు? పాలు తమ ♦ కిచ్చునె యెచ్చటనైన లేఁగలన్
గుడువఁగ నీనిచోఁ గెరలి ♦ గోవులు తన్నునుగాక! భా. 4

టీ. భాస్కరా! లోభవర్తియై - లోభగుణము (పిసినిగొట్టుతనము) నం దుండినవాఁడై, (మనుష్యుఁడు) అడిగినయట్టి యాచకుల యాశలు - ప్రార్థించునట్టివారి కోరికలు, ఎఱుఁగక - తెలిసికొనలేక, కడపినన్ - కాలము పుచ్చుచుండిన యెడల, ధర్మదేవత - ధర్మము అనునట్టి దేవత, వానికిన్, ఒకానొక యప్పుడుఁన్ - ఏ సమయమునందును, ఎయ్యెడలన్ - ఏచోటనైనను, ఈదు - ఇయ్యదు, అదెట్లు - అని యే విధముగా ననఁగా; ఎచ్చటన్ - ఏ స్థలముననైనను, గోవులు - ఆవులు, లేగలన్ - దూడలను, కుడువఁగన్ + ఈనిచోన్ - పాలను త్రాగనీయనియెడల, కెరలి - కోపించి, తన్నునుగాక - తన్నునుగాని, పాలు - పాలను, తమకున్ - పితుకువారికి, ఇచ్చునె? - ఇయ్యఁగలవా? (ఇయ్యవని భావము).

తా. భాస్కరా! తన దగ్గఱకు వచ్చి యడుగుచున్నట్టి యాచకుల కోరికలను దీర్పక పిసినిగొట్టై (లోభియై) కాలము పుచ్చుచుండినవానికి ధర్మదేవత యే సమయమునందు, ఎచ్చటను నేమియు నియ్యఁజాలదు. అదెట్లనఁగా, ఆవులు దూడలను పాలుత్రాగ నియ్యక పోయినచో తప్పక తన్నును గాని ఎవ్వరికిని పాలనియ్యవు.

చ. అతిగుణహీనలోభికిఁ బ ♦ దార్థము గల్గిన, లేకయుండినన్
మితముగఁ గాని కల్మిగల ♦ మీఁదటనైన భుజింపఁ డింపుగా;
సతమని నమ్మ దేహమును ♦ సంపద నేఱులు నిండి పాఱినన్
గతుకఁగఁజూచుఁ గుక్క తన ♦ కట్టడ మీఱక యెందు భా. 5

టీ. భాస్కరా! అతి గుణహీనలోభికిన్ - మంచిగుణములులేని లోభివానికి, పదార్థము - వస్తువు, కల్గినన్ - ఉండినప్పటికిని, లేకయుండినన్ - లేకపోయినప్పటికిని, మితముగన్ - తగినట్లుగా, అల్పముగా, కాని - అయినను, కల్మిగల మీఁదట నైనన్ - సంపద వచ్చిన తర్వాత నైనప్పటికిని, ఇంపుగాన్ - సంతోషముతో, భుజింపఁడు - తినఁడు, దేహమును-శరీరమును, సంపదన్ - ధనమును, సతము - శాశ్వతము, ఎల్లకాలము ఉండునది, అని - అనుకొని, నమ్మన్ - నమ్ముకొనును, కుక్క, ఏఱులు - నదులు, నిండి, పాఱినన్ - ప్రవహించినప్పటికిని, తన కట్టడ మీఱక-తన యేర్పాటు దాఁటక, ఎందున్ - ఎక్కడనైనను, గతుకఁగన్ చూచున్ - నాలుకతో అద్దుకొనుటకే చూచుచుండును.

తా. భాస్కరా! ఏఱు లెంత నిండి పాఱుచుండినను కుక్క యేవిధముగాఁ దన స్వభావమును మానక నీటిని నాలుకతోనే అద్దుకొని తృప్తిపడునో, అట్లే లుబ్ధుఁడుకూడఁ దనకు ధనము లేనప్పుడుగాని, యున్నప్పుడుగాని యొకేవిధముగ ననుభవింపక (భుజింపక) యుండునేగాని, యనుభవింపఁజాలఁడు.

చ. అదనుదలంచి కూర్చి, ప్రజ♦నాదరమొప్ప విభుండు కోరినన్
గదిసి పదార్థ మిత్తు; రటు♦కానక వేగమె కొట్టి తెండనన్
మొదటికి మోసమౌఁ; బొదుగు♦మూలముగోసినఁ బాలుగల్గునే
పిదికినఁగాక భూమిఁ బశు♦బృందము నెవ్వరికైన? భా. 6

టీ. భాస్కరా! విభుండు - రాజు, అదను - తగిన సమయమును, తలంచి - ఎంచి, విచారించి, ప్రజన్ - జనమును, కూర్చి - చేర్చి (ఒకచోటఁ గూడునట్లుచేసి), ఆదరము + ఒప్పఁగన్ - మర్యాదయుండునట్లుగా, కోరినన్ - అడిగిన యెడల, కదిసి - దగ్గఱఁజేరి, పదార్థమున్ - కోరినవస్తువును, ఇత్తురు - ఇచ్చెదరు, అటుకానక - ఆ విషయము తెలిసికొనలేక, వేగమె - త్వరగా, కొట్టి - హింసపెట్టి, తెండు + అనన్ - తెమ్మనఁగా, మొదటికిన్ + మోసము +

ఔన్ - అసలునకే అపాయము గలుగును, భూమిన్ - లోకమునందు, పశుబృందముల్ - పశువుల సమూహమును, పితికినన్ + కాక - పిండిననే కాని, పొదుగు మూలముల్ - పొదుగు మొదటికి, కోసినట్లయిన, పాలుకలుగునే - పాలు లభించునా? (లభింపవు)

తా. భాస్కరా, రాజుగా నుండువాఁడు, ఎప్పుడైనను, తగినకాలమును గుర్తెఱిఁగి ప్రజలను ఒకచోటఁ గూడునట్లుచేసి, మర్యాదతో నేదయినఁగోరికను గోరినయెడల వారును తన దగ్గఱఁజేరి కోరినవస్తువును తప్పక యిత్తురు. అట్లుగాక బాధించి, బెదిరించి, హింసించి, తెమ్మని దౌర్జన్యము చేసినచో రాజునకే మోసము కలుగును. ఫలము కలుగదు. ఎట్లనఁగా లోకములో ఆవులను తృప్తిపఱచి పిండిన యెడల పాలుదొరకును గాని మొదలంటఁ బొదుగును గోసిన యెడల పాలు దొరకవు గదా?

చ. అనఘునికైనఁ జేకుఱు ననర్హునిఁగూడి చరించినంతలో
మన మెరియంగ నప్పు డవమానము, కీడు ధరిత్రియందు; నే
యనువున నైనఁ దప్పవు; యథార్థము; తానదియెట్టు లన్నచో
నినుమునుగూర్చి యగ్ని నలయింపదె సమ్మెట పెట్టు? భా.

టీ. భాస్కరా! ధరిత్రియందున్ - భూమియందు, అనఘునికైనన్ - పాపములేనివానికైనను, అనర్హునిన్ - పనికిరానివానిని, కూడి - చేరి, చరించినంతలోన్ - తిరిగినయెడల, మనము - మనస్సు, ఎరియంగన్ - మండునట్లుగా, అప్పుడు - ఆ సమయమునందు, అవమానము, కీడు - హానియు, చేకుఱున్ - కలుగును, ఏ యనువుననైనన్ - ఏ యుపాయము చేతనైనను, తప్పవు - తప్పిపోవు, యథార్థము - నిజము, తాన్ + అది + ఎట్టులు - అది ఏ విధముగా, అన్నచో - అనినయెడల, ఇనుమునుగూర్చి అగ్నిన్ - ఇనుముతోఁ గూడిన యగ్నిని, సమ్మెట పెట్టు - సమ్మెట దెబ్బ, అలయింపదె - కష్ట పెట్టదా? (కష్టపెట్టును)

తా. భాస్కరా! ఎవ్వఁడైనను, ఏతప్పు చేయనివాఁడైనను, దుర్మార్గునితోఁ జేరియుండినంతమాత్రమున, దుర్మార్గునకుఁ గలుగునట్టి యవమాన

మును, హానియును తప్పక కలుగును. తప్పించుకొనుట కుపాయమును లేదు. ఎట్లనఁగా అగ్ని యినుముతోఁ గూడినమాత్రాన సమ్మెటదెబ్బ తినుచున్నది గదా?

చ. అలఘు గుణప్రసిద్ధుఁడగు♦నట్టి ఘనుం డొకఁ డిష్టుఁడై తనున్
వలచి, యొకించు కే మిడిన♦వానికి మిక్కిలి మేలుచేయుఁగా?
తెలిసి కుచేలుఁ డొక్కకొణి♦దెండడుకుల్ దనకిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁ డత్యధిక♦భాగ్యము లాతనికీఁడె? భా. 8

టీ. భాస్కరా! అలఘు - గొప్ప, గుణ ప్రసిద్ధుఁడు - గుణములచేతఁ బ్రఖ్యాతికెక్కినవాఁడు, అగునట్టి - అయిన, ఘనుండు - గొప్పవాఁడు, ఒకఁడు, ఇష్టుఁడై - ప్రియమయినవాఁడై, తనున్, వలచి - ప్రేమించి (కోర్కెతోఁ గూడినవాఁడై), ఒకించుక - కొంచెము, ఏమి + ఇడినన్ - ఏదియిచ్చినను, వానికిన్, మేలు - ఉపకారము, మిక్కిలి - ఎక్కువగా, చేయున్ + కాన్ - చేయును గదా? కుచేలుఁడు, తెలిసి - తెలిసికొని, ఒక్క కొణిదెండు - ఒక్క చేరెఁడు, అడుకుల్ - అటుకులు, తనకున్, ఇచ్చినన్ - ఇయ్యఁగా, మహాఫలదుఁడు - గొప్పఫలమును ఇచ్చునట్టి కృష్ణుఁడు, ఆతనికి - ఆ కుచేలునకు, అత్యధిక భాగ్యములు - మిక్కిలి యెక్కువ యయిన సంపదలు, ఈఁడె - ఇయ్యఁడా? (ఇచ్చెనని భావము)

8. కుచేలుఁడు - అడుకులు - శ్రీకృష్ణుఁడు.

కుచేలుఁడు పేదబ్రాహ్మణుఁడు. శ్రీకృష్ణుఁడును, కుచేలుఁడును సాందీపుఁడు అను మునియొద్ద విద్యల నభ్యసించిరి. కావున బాల్యమిత్రుఁడు. ఇతఁడు వివాహముచేసికొని యిరువదియేడ్వురు కొడుకులను గనెను. కుటుంబము పోషింపఁజాలక, యన్నంతలోఁ దృప్తిపడుచుండెను. ఇతని భార్య ప్రోత్సహింపఁగాఁ జిన్ననాఁటి మిత్రుఁడును, సమస్తసంపదలఁ గోరినవారలకిచ్చు శ్రీ కృష్ణమూర్తిని దర్శింపఁబోయెను. నివ్వరిధాన్యముతోఁ జేసిన అడుకులను జేరెఁడు కానుకగా నిచ్చెను. భక్తిపూర్వకమగు ఆ కానుకకు దయగల భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు మహైశ్వర్యమునిచ్చి భాగ్యవంతునిఁ గావించెను. గుణవంతుఁడు ప్రీతితోనిచ్చిన యే యల్పమునకైనను మితిలేని మేలు గావించుననుట కిది సారము.

తా. భాస్కరా! గుణవంతుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడు తనకుఁ బ్రీతితో నెవరయిన నేది కొంచెము సమర్పించినను, వాని కపరిమితమగు మేలు కావించును. ఎట్లనఁగా శ్రీ కృష్ణుఁడు తనకుఁ గుచేలుఁడు ప్రేమతో చేరెఁడటుకులు మిక్కిలి గౌరవముతో, భక్తితో సమర్పింపఁగానే యపరిమితములయిన సంపదలను ఇయ్యలేదా?

చ. అవనివిభుండు నేరుపరి♦యై చరియించినఁ గొల్చువార లె
ట్లవగుణులైన నేమి? పను♦లన్నియుఁ జేకుఱు వారిచేతనే;
ప్రవిమలనీతిశాలి యగు ♦ రామునికార్యము మర్కటంబులే
తవిలి యొనర్పవే జలధి ♦ దాఁటి సురారులఁ ద్రుంచి? భా. 9

టీ. భాస్కరా! అవనివిభుండు - రాజు, నేరుపరియై - చాతుర్యము కలవాఁడై, చరియించినన్ - నడుచుకొనినయెడల, కొల్చువారలు - సేవకులు, ఎట్లు - ఏ విధముగా, అవగుణులు - చెడ్డగుణము గలవారు, ఐనన్ + ఏమి? - అయినప్పటికిని, వారిచేతనే - ఆ సేవకులచేతనే, పనులన్నియున్, చేకుఱున్ - నెఱవేఱును; ప్రవిమల నీతిశాలి - మిక్కిలి స్వచ్ఛమయిన రాజనీతి గలిగినవాఁడు, అగు - అయిన, రామునికార్యము - శ్రీరామునియొక్క పని, మర్కటంబులే - కోఁతులే, తవిలి - శ్రద్ధను బూని, జలధిన్ - సముద్రమును, దాఁటి, సురారులన్ - రాక్షసులను, త్రుంచి - చంపి, ఒనర్పవే - చేయలేదా? (చేసెనని భావము)

తా. భాస్కరా! లోకమున రాజయినవాఁడు శక్తిగలవాఁడయిన యెడల సేవకు లెంత పనికిరాని చెడ్డవారయినను, వారిచేతనే తన సమస్తకార్యములు నెఱవేర్చుకొనఁ గలఁడు. ఎట్లనఁగా, శ్రీరామచంద్రుని కార్యమును వానరములే శ్రద్ధవహించి సముద్రమును దాఁటి, రాక్షసులఁ జంపి నెఱవేర్పలేదా?

ఉ. ఆదర మింతలేక నరుఁ♦డాత్మబలోన్నతి మంచివారికిన్
భేదము చేయుటం దనదు♦పేర్మికిఁ గీడగు; మూలమె; ట్లమ

ర్యాద హిరణ్యపూర్వకశిపన్ దనుజుండు గుణాఢ్యుఁడైన ప్ర
హ్లాదున కెగ్గుచేసి ప్రళయంబును బొందఁడె మున్ను? భా. 10

టీ. భాస్కరా! నరుఁడు - మనుష్యుఁడు, ఆదరము - మర్యాద, ప్రీతి ఇంతలేక - కొంచెమయినను లేక, ఆత్మబలోన్నతిన్ - తనయొక్క యెక్కువ బలముచేత, మంచివారికిన్ - సజ్జనులకు, భేదముచేయుటన్ - చెఱుపుచేయుట చేత, తనదుపేర్మికిన్ - తనయొక్క గొప్పకీర్తికి, కీడు + అగున్ - చెడుపు కలుగును, మూలము - కారణము, ఎటు - ఏ విధము (అనఁగా), మున్ను - పూర్వము, హిరణ్యపూర్వకశిపు + అన్ దనుజుండు - హిరణ్యశబ్దము ముందుగాఁ గల కశిపుఁడు అను రాక్షసుఁడు (హిరణ్యకశిపుఁడు), గుణాఢ్యుఁడు - మంచి గుణములు గలవాఁడు, ఐన - అగు, ప్రహ్లాదునకున్ - ప్రహ్లాదుఁడను బాలునకు, ఎగ్గు - కీడు, చేసి - కలిగించి, ప్రళయంబును - నాశమును, పొందఁడె? - పొందలేదా?

తా. భాస్కరా! లోకములో నెవఁడయినను, గొంచెమయిన ప్రేమలేక, మర్యాదను జూడక తన బలగర్వముచేత సత్పురుషులకుఁ గీడుచేసినయెడల

10. ప్రహ్లాదుఁడు - హిరణ్యకశిపుఁడు.

హిరణ్యకశిపుఁడు రాక్షసులకు రాజు. ప్రపంచమునఁ దానే భగవంతుఁడ నని, తన నామమే తలఁపవలయునని ఘోషించుచు దేవతలను, దేవతాధీశులను నానాబాధలఁబెట్టెను. ఇట్టివానికిఁ బ్రహ్లాదుఁడను పుత్త్రుఁడు గలఁడు. చిన్ననాఁటినుండియు నీ బాలుఁడు విష్ణుభక్తితో నుండెను. తనకు విరోధియగు విష్ణునిఁ దలఁచుచున్నాఁడే యని పుత్త్రునిఁ జదివించెను. తన్నుగుఱించి బోధించెను. బాలుఁడు విష్ణుభక్తి మానలేదు. హిరణ్యకశిపుఁడు నానాహింసలఁబెట్టెను. భగవంతుఁడగు విష్ణువొక్కఁడే సర్వకర్త; సర్వము దనలోను, సర్వమునందును దాను నుండువాఁడని వాదించెను. సాధుగుణుఁడగు ప్రహ్లాదునకు విషము పెట్టియు, యేనుఁగులతోఁ ద్రొక్కించియు నపరిమితబాధల నలపెను. విష్ణుమూర్తి ప్రహ్లాదుని రక్షించి హిరణ్యకశిపుని శిక్షింపఁగోరి స్తంభమం దుదయించి యా రాక్షసునిఁ జంపెను. హిరణ్యకశిపుని తండ్రి కశ్యపప్రజాపతి; తల్లి దితి. ప్రహ్లాదుని తల్లి లీలావతి.

తనకీర్తికిని, బ్రదుకునకును హాని తప్పక పొందఁగలఁడు. పూర్వము హిరణ్య కశిపుఁడు తన కుమారుఁడగు ప్రహ్లాదుని నానావిధములుగ బాధించి తానే నశిఁచెను గదా ?

ఉ. ఆరయ నెంత నేరుపరి•యైె చరియించిన, వానిదాపునన్
గౌరవ మొప్పఁగూర్చు నుప•కారి మనుష్యుఁడు లేక మేలుచే
కూర; దదెట్లు? హత్తుగడ•గూడునె? చూడఁ బదాఱువన్నె బం
గారములోన నైన వెలి•గారము కూడకయున్న ? భా. 11

టీ. భాస్కరా! ఆరయన్ - విచారింపఁగా, (మనుష్యుఁడు) ఎంత నేరుపరియై - ఎంతటి శక్తిగలవాఁడుగా నుండి, చరియించిన - ప్రవర్తించుచుండినను, వాని దాపునన్ - వాని దగ్గఱ, గౌరవమొప్పన్-మర్యాద యుండునట్లు, కూర్చు - కలిగించు, ఉపకారి - మేలుచేయునట్టి, మనుష్యుఁడు లేక, మేలు - మంచి, చేకూరదు - కలుగదు, అది, ఎట్లు ? - ఏ విధముగా ననఁగా, చూడన్ - తలపోయఁగా, పదాఱువన్నె బంగారములోన నైనన్ - మేల్మిబంగారునందయినను, వెలిగారము కూడకయున్నన్ - వెలిగారము అను వస్తువు చేర్చక యుండినచో, హత్తుగడ - అతుకుకొనుట, కూడునె - జరుగునా ? (జరుగదు.)

తా. భాస్కరా ! లోకమునందు ఎంతటి శక్తియుక్తులుగలవానికైనను, వాని దగ్గఱ మర్యాద కలిగించుటకుఁ దగిన యొక మంచివాఁడు లేక యుండినచో మేలు కలుగఁజాలదు. ఎట్లనఁగా ; పదునాఱవ వన్నెగలిగిన శ్రేష్ఠమయిన బంగారునకుఁ గూడ వెలిగారము కూడక యుండినచో అతుకు బడఁజాలదు. ప్రకాశింపదు.

ఉ. ఈక్షితి నర్థకాంక్ష మది • నెప్పుడు పాయక లోకులెల్ల సం
రక్షకుఁ డైన సత్ప్రభుని•రాకలు గోరుదు రెందుఁ; జంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁ డుద•యించు విధంబునకై చకోరపుం
బక్షులు చూడవె యెదుర • పార ముదంబును బూని భా. 12

టీ. భాస్కరా! ఈక్షితిన్ - ఈ భూమియందు, లోకులెల్లన్ - జను లందఱును, మదిన్ - మనస్సునందు, అర్థకాంక్ష - ధనమునందలి ఆశను, ఎప్పుడున్, పాయక - వదలక, సంరక్షకుఁడు - చక్కఁగాఁ బాలించునట్టి వాఁడు, ఐన - అగు, సత్ప్రభుని రాకలు - మంచి రాజుయొక్క రాకలను, ఎందున్ - ఏచోట నయినను, కోరుదురు - కోరుచుందురు, చకోరపుంబక్షులు - చక్రవాకపక్షులు, చంద్రికాపేక్షన్ - వెన్నెలను చూచు కోరికతో, చెలంగి - సంతోషించి, చంద్రుఁ డుదయించు విధమునకై - చందమాను యుత్పత్తి కొఱకై, అపార ముదంబును - ఎక్కువ సంతోషమును, పూని - పొంది, ఎదురు చూడవే? (ఎదురు చూచునని భావము)

తా. భాస్కరా! ఈ ప్రపంచమునందు జనులెల్లరు ధనాశను వదలక బాగుగాఁ బరిపాలించు రాజుయొక్క రాకను గోరుచుందురు. ఎట్లనఁగా: చకోరములు వెన్నెలను గోరుచున్నవై మిక్కిలి సంతోషముతోఁ జంద్రుని రాకకై ఎదురుచూచుచుండును గదా?

ఉ. ఈ జగమందు దా మనుజుఁ డెంత మహాత్మకుఁడైన దైవమా
తేజము తప్పఁ జూచునెడఁ ద్రిమ్మరి కోల్పడు; నెట్లనన్మహా
రాజకుమారుఁడైన రఘురాముఁడు గాల్నడఁ గాయలాకులున్
భోజనమై తగ న్వనికిఁ బోయి చరింపఁడె మున్ను భా. 13

టీ. భాస్కరా! ఈ జగమందున్ - ఈ లోకమునందు, తాన్ - తాను, మనుజుఁడు - మనుష్యుఁడు, ఎంత మహాత్మకుఁడు + ఐనన్ - ఎంత గొప్ప వాఁడు అయినప్పటికిని, దైవము, ఆ తేజము - ఆ ప్రభావమును, తప్పఁ జూచునెడన్ - పోవునట్లు చూచినయెడల, త్రిమ్మరి - తిరిగి, కోల్పడున్ - పోఁగొట్టుకొనును; ఎట్లు + అనన్ - అదెట్లనఁగా, మున్ను - పూర్వము, మహా రాజకుమారుఁడు + ఐన - గొప్పరాజపుత్రుండగు, రఘురాముఁడు-రఘువంశము నందు జనించిన శ్రీరాముఁడు, కాల్నడన్ - కాలినడకతో (పాదచారియై), కాయలు, ఆకులున్, భోజనము + ఐ - ఆహారముగానుండి, తగన్, వనికిన్ - అరణ్యమునకు, పోయి - వెళ్ళి, చరింపఁడె? - తిరుగలేదా?

తా. భాస్కరా! ఈ లోకములో మనుష్యుఁడు తా నెంత మహిమగల వాఁడయినను అదృష్టము (దైవము) తప్పినపుడు తన మహిమను బోఁగొట్టుకొని శ్రమపడును. ఎట్లనఁగా మహారాజకుమారుఁడు అయి, రఘువంశమునఁ బుట్టిన శ్రీరాముఁడు పాదచారియై కాయలు ఆకులు తినుచు నరణ్యముల వెంటఁ దిరుగలేదా?

చ. ఉరుకరుణాయుతుండుసమ♦యోచితమాత్మఁదలంచి యుగ్రవా
క్పరుషతఁజూపినన్ ఫలము♦గల్గుట తథ్యముగాదె;యంబుదం
బుఱిమినయంతనే కురియ♦కుండునె వర్షము లోకరక్షణ
స్థిరతరపౌరుషంబున న ♦ శేషజనంబు లెఱుంగ భా. 14

టీ. భాస్కరా! ఉరుకరుణాయుతుండు - మిక్కిలి దయతోఁ గూడిన వాఁడు, సమయోచితము - కాలమునకుఁ దగినరీతిని, ఆత్మన్ - మనస్సునందు, తలంచి - యోజించి, ఉగ్రవాక్పరుషతన్ - భయంకరమయిన మాటలయొక్క కఠినత్వమును, చూపినన్ - కనఁబఱచినప్పటికిని, ఫలము - తగినలాభము, కల్గుట తథ్యముగాదె-కలుగుట నిజముకదా? (తప్పక మంచి ఫలముమాత్ర కలుగును), అంబుదంబు - మేఘము, ఉఱిమినయంతనే - ఉఱుమఁగానే, లోకరక్షణ - ప్రపంచమును గాపాడుటయందు, స్థిరతర - మిక్కిలి చలనము లేకయుండిన, పౌరుషంబునన్ - పురుష ప్రయత్నముచేత, అశేషజనంబులు - సకలజనులును, ఎఱుంగన్ - తెలియునట్లుగా, వర్షము - వాన, కురియక ఉండునే - కురియుచున్నదికదా?

తా. భాస్కరా! దయగలవాఁడు సమయమునుబట్టి కఠినముగా మాటలాడినను తగిన సమయమున మంచి ఫలమునుమాత్రము దయచేయఁగలఁడు. ఇది నిజము.

---

13. శ్రీరాముఁడు - అరణ్యావాసము.

సూర్యవంశమునందు దశరథుఁడను రాజుండెను. ఇతఁడు అయోధ్యయందు రాజయి భూమిని బరిపాలించుచుండెను. భగవదంశవలన శ్రీరాముఁడు, లక్ష్మణుఁడు, భరతుఁడు, శత్రుఘ్నుఁడు అను నలువురు కొడుకులు దశరథునకుఁ గలిగిరి. తండ్రియాజ్ఞను బూని శ్రీరాముఁడు లక్ష్మణునితో

మేఘము కఠినముగా గర్జించినప్పటికి, జనులకందఱకును సంతోషము కలుగునట్లుగ జీవితమున కుపయోగించు వర్షమును కురిపెంచుచున్నది.

చ. ఉరుగుణవంతుఁ డొడ్లు తన♦కొండపకారము చేయునప్పుడుం
బరహితమే యొనర్చుఁ; నొక♦పట్టుననైనను గీడుఁజేయఁగా
నెఱుఁగఁడు;నిక్కమేకద!య♦దెట్లనఁ,గవ్వముబట్టియెంతయుం
దఱువఁగఁజొచ్చినం బెరుఁగు♦తాలిమినీయదె వెన్న? భా. 15

టీ. భాస్కరా! ఉరుగుణవంతుఁడు - మిక్కిలి గొప్పగుణములు గలవాఁడు, ఒడ్లు - ఇతరులు, తనకున్ - తనకు, ఒండు - ఒకానొక, అపకారము - కీడు, చేయునప్పుడున్ - చేయునట్టి కాలమునందుఁగూడ, పరహితమే - ఇతరులకు మేలుమాత్రమే, ఒనర్చున్ - చేయును, ఒకపట్టుననైనను - ఒకానొక సమయమునందైనను, కీడుచేయఁగాన్ - చెడ్డచేయుటకు, ఎఱుఁగఁడు - తలంపఁడు, నిక్కమేకద - ఈ విషయము నిజముగదా? అది + ఎట్లు + అనన్ - అదెట్లనఁగా, కవ్వమున్ పట్టి - కవ్వము పట్టుకొని, ఎంతయున్ - మిక్కిలి, తఱువఁగఁ జొచ్చినన్ - చిలుకుటకుఁ బూనుకొనినను, పెరుఁగు, తాలిమిన్ - ఓర్పుతో, వెన్నన్ - వెన్నను, ఈయదె - ఇయ్యదా?

తా. భాస్కరా! గుణవంతుఁడైనవాఁడు తన కితరు లెంతటి యపకారమును జేసినను తాను మాత్రము వారి కుపకారమునే చేయునుగాని కీడు చేయఁడు. కవ్వముతో నెంతగాఁ జిలికినను పెరుగు వెన్ననే ఇచ్చుచుండును గదా?

చ. ఉరుబలశాలి నంచుఁ దను ♦ నొల్లని యన్య పతివ్రతాంగనా
సురతము గోరెనేని కడ♦సుమ్మది భూతికిఁ; బ్రాణహానియౌ;

---

డను, భార్యతోడను నరణ్యావాసము పదునాల్గు సంవత్సరములు చేసెను. రాజ్య పట్టాభిషేకము వదలి యరణ్యమునకు వెళ్ళి కాయగసురులు తినుచుఁ గష్టములు అనుభవించి మునుల కుపకారము చేసినాఁడు. ఎంత మంచివాఁడయినను, దైవబలముగలవాఁడయినను, అడవియందుఁ గష్టపడుట యదృష్టము తప్పఁజూచుటచేఁ గదా?

శిరములు గూల రాఘవునిచే దశకంఠుఁడు ద్రుంగిపోవఁడే
యెఱుఁగక సీత కాసపడి యిష్టుల భృత్యులఁ గూడి భా. 16

టీ. భాస్కరా! ఉరుబలశాలిన్ + అంచున్ - మిక్కిలి ఎక్కువ బలము గలవాఁడనని మనుష్యుఁ డెవఁడయినను, తనున్ - తనను, ఒల్లని - ఇష్టపడని, అన్యపతివ్రతాంగనా సురతమున్ - మఱియొక పతివ్రతయగు స్త్రీ యొక్క కూడికను, కోరె నేని - కోరినట్లయినచో, అది - ఆ చెడ్డపనియే, భూతికిన్ - ఐశ్వర్యమునకు (సంపదకు), కడసుమ్ము - అంతమే యగును, ప్రాణహానియగున్ - ప్రాణమునకు అపాయము అగును, దశకంఠుఁడు - పది తలలుగల రావణాసురుఁడు, ఎఱుఁగక - తెలియక, సీతకున్ - సీతాదేవిని, ఆశపడి - ఆశించి, శిరములు గూలఁగా - తలలు పడిపోఁగా, ఇష్టులన్ - హితులను, భృత్యులనుగూడి - సేవకులతోఁ గూడినవాఁడై, రాఘవునిచేన్ - శ్రీరామునిచే, ద్రుంగిపోవఁడే - నశింపఁడా (చావఁడా).

తా. భాస్కరా! ఎవఁడయినను, నేనే బలవంతుఁడనని గర్వించి, ఇతర స్త్రీని, ఇష్టపడకయున్నను, బలాత్కారముచేసి యాక్రమింపఁ గోరినయెడల వాని యైశ్వర్యము చెడుటయేగాక వాఁడును అంతటితో నశింపఁగలఁడు. పదితలలు కలిగి లోకమునంతను జయించిన రావణాసురుఁడుగూడ సీతాదేవిని కోరుటచేత తన మిత్రులు, బంధువులు, భృత్యులు, సంపద నశించుటయేగాక తానును నశించెను. ఇది సత్యము.

---

16. రావణుఁడు - పతివ్రత సీత.

విశ్రవోబ్రహ్మకొడుకు రావణుఁడు. రావణుఁడు లోకములను బాధించుటయే గాక స్త్రీలను జెఱఁబట్టుకొనుచు వచ్చెను. శ్రీరాముఁడు అరణ్యవాసము చేయుకాలమున శ్రీరాముని భార్యయుఁ, బతివ్రతయు నగు సీతాదేవిని సన్న్యాసివేషముఁబూని మోసముచె నపహరించి తెచ్చి లంకలో రాక్షసస్త్రీల మధ్య నుంచి మిక్కిలి హింసపెట్టి, తన్నుఁ బెండ్లాడుమని బాధించెను. ఈ చెడ్డకార్యమును జేయుటవలన రావణుఁడు బుత్త్ర మిత్రులతోఁగూడ నశించెను. పతివ్రతలను బాధించువారు చెడుదురనుట కిదియే యుదాహరణము.

ఉ. ఊరక వచ్చుఁ బాటుపడ ♦ కుండిననైన ఫలం బదృష్ట మే
పారఁగఁ గల్గువానికిఁ; బ్రయాసము నొందిన దేవదానవుల్
వార లటుండఁగా నడుమ ♦ వచ్చిన శౌరికిఁ గల్గెఁగాదె శృం
గారపుఁబ్రోవు లక్ష్మియును, ♦ గౌస్తుభరత్నము, రెండు భా. 17

టీ. భాస్కరా! అదృష్టము - భాగ్యము, ఏపారఁగన్ - బాగుగా, కల్గువానికిన్ - ఉన్నవానికి, పాటుపడక - శ్రమపడక, ఉండిననైనన్ - ఉండినప్పటికిని, ఫలంబు - లాభము, ఊరక - ఏ శ్రమలేకయే, వచ్చున్ - కలుగును, ప్రయాసమున్ - కష్టమును, ఒందిన - పొందినట్టి, దేవదానవుల్ - దేవతలును రాక్షసులును, అటుండఁగా - ఏమియు లేకయుండఁగా, నడుమ - మధ్య, వచ్చిన - వచ్చినటువంటి, శౌరికిన్ - విష్ణుమూర్తికి, శృంగారపుఁబ్రోవు - సౌందర్యమునకు రాశియయిన, లక్ష్మియును - లక్ష్మీదేవియును, కౌస్తుభ రత్నము - మణియు, రెండును - రెండును, కల్గెన్ + కాదె - కల్గెను గదా?

తా. భాస్కరా! అదృష్టము మంచిదిగా నుండినచో శ్రమపడ నవసరములేకయే, యేప్రయత్నమును జేయకయే లాభము ఊరక కల్గును. ఎట్లనఁగా: దేవతలును, రాక్షసులును శ్రమపడి సముద్రమును జిలుకఁగా వారికి లాభమేమియుఁ గలుగక యున్నను, మధ్య వచ్చిన శ్రీ మహావిష్ణు దేవునకు సౌందర్యవతియగు లక్ష్మీదేవియుఁ, గౌస్తుభమణియు నను రెండువస్తువులు లాభించెను గదా?

17. దేవదానవులు - పాలసముద్రము తఱచుట - హరి కౌస్తుభమణిని, లక్ష్మిని కొనుట.

రాక్షసులు, దేవతలు అమృతముకొఱకయి పాలసముద్రమును, మందర పర్వతమును కవ్వముగాఁజేసి, వాసుకిని కవ్వపుఁ ద్రాడుగాఁ గావించి చిలికిరి. ఎక్కువ శ్రమపడిరి. అందు అనేకవస్తువులు పుట్టినవి. వానిలో శ్రేష్ఠములయిన వస్తువులను, శ్రీమహావిష్ణువు వచ్చి తాను సలహా ఇచ్చినట్లు నటించి కౌస్తుభ మణిని, శ్రీ మహాలక్ష్మీదేవిని గ్రహించెను.

ఉ. ఊరక సజ్జనుం డొదిఁగి ♦ యుండిననైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యప♦కారము చేయుట వాని విద్యగా;
చీరలు నూఱుటంకములు♦చేసెడి వైనను బెట్టెనుండఁగాఁ
జేరి చినింగిపోఁ గొఱుకు ♦ చిమ్మట కేమిఫలంబు? భా. 18

టీ. భాస్కరా! సజ్జనుండు - మంచి నడవడి గలవాఁడు, ఊరక - ఏ ప్రస్తావనకును బోక, ఒదిగి - అణఁగి, ఉండినన్ + ఐనన్ - ఉండినప్పటికిని, దురాత్మకుండు - చెడ్డగుణముగలవాఁడు, ఓర్వలేక - చూడలేక, నిష్కారణము - కారణము లేకయే, అపకారముచేయుట - కీడుచేయుట, వానివిద్యగా - వాని నేర్పుగదా? చీరలు - కోకలు, నూఱుటంకములు - నూఱువరహాలు, చేసెడివి - వెలగలవి, ఐనను, పెట్టెన్ - పెట్టెయందు, ఉండఁగాన్ - ఉంచినను, చేరి - ప్రవేశించి. చినింగిపోన్ - చినిగిపోవునటుల, కొఱుకు - కొఱుకునటువంటి, చిమ్మటకున్ - పురుగునకు, ఏమి ఫలంబు - ఏమి లాభము గలదు?

తా. భాస్కరా! మంచివాఁడు ఎవరిజోలికిని బోక అణఁగి మణఁగి యుండినప్పటికిని, చెడ్డవాఁడు ఓర్వఁజాలక నిష్కారణముగాఁ గీడుచేయుచుండుట వాని స్వభావము. మిక్కిలివెలగలిగిన వస్త్రములు పెట్టెయందుండఁగా నందుఁ జిమ్మటపురుగు చేరి చినింగిపోవునట్లు కొట్టుచుండునుగదా? దానికిఁ గల ఫలమేమి?

ఉ. ఎట్టుగఁ బాటుపడ్డ నొక♦యించుక ప్రాప్తము లేక వస్తువుల్
పట్టుపడంగ నేరవు; ని ♦ బద్ధి; సురావళిఁగూడి రాక్షసుల్
గట్టు పెకల్చి పాల్కడలిఁ♦గవ్వముచేసి మథించి;రంతయున్
వెట్టియె గాక, యే మనుభ♦వించిరి వా రమృతంబు భా. 19

టీ. భాస్కరా! ఎట్టుగన్ - ఏవిధముగ, పాటుపడ్డన్ - శ్రమపడినప్పటికిని, ఒక యించుక - ఏ కొంచెమయినను, ప్రాప్తములేక - అదృష్టము లేక, వస్తువుల్ - పదార్థములు, పట్టుపడంగన్ - దొరకఁగా, నేరవు - చాలవు,

నిబద్ధి - నిజము, రాక్షసుల్ - రక్కసులు, సురావళిఁ - దేవతా సమూహము లతో, కూడి - చేరి, గట్టు - కొండను, పెకల్చి - పెకలించి, పాల్కడలిఁ - పాల సముద్రమునందు, కవ్వముఁజేసి - కవ్వము చేసికొని, మథించిరి - చిలికిరి, అంతయుఁ - ఆకార్య మంతయును, వెట్టియై కాక - వ్యర్థమే కాక, వారు - ఆరాక్షసులు, అమృతంబుఁ - చిలుకఁగా కలిగిన అమృతమును, ఏమి అనుభవించిరి - ఏమి పొందిరి ?

తా. భాస్కరా ! ఎంత శ్రమపడినను, అదృష్టమనునది లేకపోయిన నేవస్తువుగాని కొంచెమయినను లభింపఁజాలదు. ఇది నిజమయిన మాట. దేవత లతోఁగూడి రాక్షసులు కొండను పెకలించి కవ్వమునుగాఁజేసి పాలసముద్ర మును శ్రమపడి చిలికిరి. ఈ శ్రమ యంతయు వ్యర్థమేగాని అమృతమును ఎంతమాత్ర మనుభవింపఁ గలిగిరి ?

చ. ఎడపక దుర్జనుం డొరుల కెంతయుఁగీడొనరించుఁగాని, యే
యెడలను మేలు సేయఁ డొక యించుకయైనను; జీడపుర్వు దాఁ
జెడఁ దిను; నింతెకాక పుడిసెండు జలం బిడి పెంప నేర్చునే
పొడ వగుచున్న పుష్ప ఫల భూరుహ మొక్కటి నైన? భా.20

టీ. భాస్కరా! దుర్జనుఁడు - చెడ్డవాఁడు, ఎడపక - ఆలోచన చేయక, ఒరులకుఁ - ఇతరులకు, ఎంతయుఁ - మిక్కిలి, కీడు - చెడుగు, ఎప్పుడు,

---

19. రాక్షసులు కష్టపడుట - అమృతము లభింపకపోవుట.

సముద్రమును మందరపర్వతముతో దేవతలు, రాక్షసులు చిలుకునపుడు రాక్షసులు వాసుకి యను సర్పముయొక్క పడగలవైపు పట్టుకొని యాసర్పము బాధను సహింపలేక ఫణములనుండి విషము గ్రక్కుచుండఁగా ఆ మంటలను భరించుచు అమృతముకొఱకుఁ బ్రయత్నముతో నెగుచుచూచుచుండిరి. కాని, అమృతము పుట్టఁగనే శ్రీమహావిష్ణువు మోహినీరూపముతో నవతరించి దేవత లను, రాక్షసులను బంక్తులుగాఁ గూర్చుండఁబెట్టి, యమృతమును పంచుటకుఁ బూనుకొని, యమృతమంతయు దేవతలకుఁ బోసి రాక్షసులకు రిక్తహస్తములను జూపెను. రాక్షసు లామాయకు మోసపోయి విఫలులైరి. చేసిన చాకిరి యంతయు వ్యర్థమయ్యెను.

ఒనరించుఁ - చేయును, కాని - కాక, ఏ యెడలన్ - ఏచోటనయినను, ఒక ఇంచుకయైనను - కొంచెమయినను, మేలుచేయఁడు - మంచిచేయఁడు, చీడ పుర్వు - చీడపురుగు, తాన్ చెడన్ తినున్ - తాను చెట్టును నాశన మగునట్లు కొఱకును, ఇంతె కాక - ఇంతియేగాని, పుడిసెండు - ఒక చేరెఁడు, జలంబు - నీరు, ఇడి - ఇచ్చి, పొడవగుచున్న - పెద్దదగునట్టి, పుష్పఫల భూరుహము - పువ్వులు పండ్లు గల చెట్టును, ఒక్కటినైన - ఒక్కదానినైన, పెంపన్ + నేర్చునే - పెంచఁగలడా ?

తా. భాస్కరా! దుష్టుఁడు ఇతరుల కెపుడును గీడే చేయుచుండును గాని, మేలు కొంచె మైనను చేయఁడు. చీడపుర్వు వృద్ధిపొందుచున్నట్టి పూలు పండ్లు గల చెట్టును తెగఁగొఱకునేగాని చేరెఁడు నీళ్లుపోసి యెన్నఁడును బెంచఁజాలదు.

ఉ. ఎడ్డెమనుష్యుఁ డేమెఱుఁగు • నెన్ని దినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గల • తోరపువర్తన లెల్లఁ బ్రజ్ఞఁ బే
ర్వడ్డవివేకిరీతి; రుచి • పాకము నాలుక గాక యెఱుంగునే
తెడ్డది కూరలోఁ గలయఁ • ద్రిమ్మరుచుండిన నైన భా. 21

టీ. భాస్కరా! ఎన్ని దినంబులు - ఎన్నినాళ్లు, కూడియుండినన్ - దగ్గఱఁ జేరియుండినప్పటికిని, ఎడ్డెమనుష్యుఁడు - తెలివిలేనివాఁడు, దొడ్డ గుణాఢ్యునందున్ - గొప్పగుణములు గలవానియందు, కల - ఉండిన, తోరపు వర్తనలు - గొప్ప నడవడులు, ఎల్లన్ - అన్నియును, ప్రజ్ఞన్ - తెలివిచేత, పేర్వడ్డ - ప్రఖ్యాతికెక్కిన, వివేకిరీతి - తెలివిగలవానివలె, ఏమి ఎఱుఁగును - ఏమి తెలియును ? రుచిపాకము - రసములయందు నేర్పు, నాలుక కాక - నాలుకకుఁగాక, కూరలోన్ - కూరయందు, కలయన్ ద్రిమ్మరుచు - బాగుగా నంతటను దిరుగుచు, ఉండిననైనన్ - ఉండినప్పటికిని, తెడ్డు - కూరలను కలియఁబెట్టెడి కొయ్య, ఏమి ఎఱుంగును ? - ఏమి తెలిసి కొనఁగలదు ?

తా. భాస్కరా! ఎన్నినాళ్లు దగ్గఱఁ జేరియుండినప్పటికిని తెలివిలేనివాఁడు గొప్పగుణములు గలవానికిఁగల శ్రేష్ఠమయిన గుణములు వివేకముగలవానివలెఁ దెలిసికొనఁజాలఁడు. కూరలో నుండు రుచి నాలుకగాక, కూరలో నెంత కలయఁదిరుగుచుండినను తెడ్డు ఏమి తెలిసికొనఁ గలదు?

ఉ. ఎప్పు డదృష్టతామహిమ◆యించుక పాటిల్గు, నప్పు డింపు సొం
పొప్పుచునుండుఁగాక◆యది◆యొప్పనిపిమ్మటరూపుమాయుఁగా;
నిప్పున నంటియున్న యతి◆నిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిన, నట్టిబొగ్గునకు◆దా నలు పెంతయుఁ బుట్టు భా. 22

టీ. భాస్కరా! ఎప్పుడు అదృష్టతామహిమ - భాగ్యముయొక్క ప్రభావము, ఇంచుక - కొంచెము, పాటిల్లున్ - కలిగియుండునో, అప్పుడు-అప్పుడే, ఇంపు - ఇష్టము, సొంపు - అందము, ఒప్పుచున్ + ఉండున్ + కాక - కలిగియుండునే గాని, అది - ఆ యదృష్టము, ఒప్పని పిమ్మటన్ - కలుగని వేళయందు, రూపు - ఆకారమే, మాయున్ + కా - నశించును గదా? నిప్పునన్ - అగ్నిని, అంటియున్న - తగిలియున్న, నిర్మలినాగ్ని - స్వచ్ఛమయినట్టి అగ్నియొక్క, గురుప్రకాశముల్ - గొప్పకాంతులు, తప్పినన్ - తప్పిపోయిన యెడల, అట్టి బొగ్గునకున్ - ఆ బొగ్గునకు, తాన్, నలుపు - నల్లరంగు, ఎంతయున్ - మిక్కిలి, పుట్టున్ - కలుగును.

తా. భాస్కరా! ఎప్పు డదృష్టము బాగుగ నుండునో అప్పుడే యందచందము లన్నియుఁ దగినట్లు ప్రకాశింపఁగలవు. అదృష్టము కొంచెము తప్పినా యపుడే స్వరూపమే నశించి యసహ్యముగఁ గనిపించును. నిప్పునందుండు స్వచ్ఛమైన యగ్నియొక్క ప్రకాశము నశింపఁగానే బొగ్గునకు నలుపు కలుగును. కాంతి నశించును.

ఉ. ఏగతిఁ బాటుపడ్డఁ గల◆దే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము, భాగ్యరేఖగల◆పుణ్యునకుంబలెఁ? భూరిసత్త్వసం
యోగమదేభకుంభముగ◆శోత్థితమాంసము నక్కకూన కే
లాగు ఘటించు? సింహము దళించినఁ జేకురుఁగాక! భా. 23

టీ. భాస్కరా! భువిన్-భూమియందు, అల్పునకున్-నీచునకు, ఏగతి - ఏవిధముగా, పాటుపడ్డన్ - శ్రమపడినను, భాగ్యరేఖల - అదృష్టము గలిగిన, పుణ్యునకున్ బలె - పుణ్యాత్మునకువలె, సమగ్రతాభోగము - సంపూర్ణ సుఖము, కలదే - ఉన్నదా? భూరిసత్త్వ - అధికబలముతో, సంయోగ - కూడిన, మదేభ - మదపుటేనుఁగుయొక్క, కుంభయుగళ - కుంభముల జంటలయందు, ఉత్థిత - పుట్టిన, మాంసము - మాంసమును, సింహము తలంచినన్ - సింహము కోరినయెడల, చేకురుఁగాక - లభించునుగాని, నక్కకూనకున్ - పిల్ల నక్కకు, ఏలాగు - ఏవిధముగా, ఘటించున్ - లభింపఁగలదు?

తా. భాస్కరా! ఎంత పాటుపడినను, నీచుఁడయిన (శక్తిలేని) వానికిఁ బుణ్యాత్మునితో సమానముగా సంపూర్ణ సుఖానుభవము గలుగదు. ఎట్లనఁగా మంచి బలముగల మదించిన యేనుఁగుల కుంభస్థలములలోని మాంసము సింహము తలఁచిన దొరకఁగలదు గాని, నక్కపిల్ల కోరిన దొరకునా?

ఉ. ఏడ ననర్హుఁ డుండు నట కేగు ననర్హుఁడు, నర్హుఁ డున్నచోఁ
జూడఁగ నొల్లఁ; డెట్లన, నశుద్ధగుణస్థితి నీఁగ పూయముం
గూడినపుంటిపై నిలువ గోరినయట్టుల నిల్వ నేర్చునే
సూడిదఁబెట్టు నెన్నుదుటి చొక్కపుఁ గస్తురిమీఁద? భా. 24

టీ. భాస్కరా! ఏడన్ - ఎక్కడ, అనర్హుఁడు - పనికిరాని వాఁడు, ఉండున్ - ఉండునో, అటకు - అక్కడికి, అనర్హుఁడు - పనికిరానివాఁడు, ఏగున్ - పోవును, అర్హుఁడు - తగినవాఁడు, ఉన్నచోన్ - ఉండినస్థలమును, చూడఁగన్ - చూచుటకుఁగూడ, ఒల్లఁడు - ఇష్టపడఁడు, ఎట్లనన్ - ఎటులనఁగా, ఈఁగ, అశుద్ధగుణస్థితిన్ - మలినగుణముగల దుర్గంధమును, కూడిన, పుంటిపైన్ - కురుపుమీఁద, నిలువన్ - నిలిచియుండుటకు, కోరినయట్టులు - ఇష్టపడినరీతి, సూడిదపెట్టు - బహుమానము గలిగించు, నెన్నుదుటి - నొసటి యొక్క, చొక్కపుఁ గస్తురిమీఁదన్ - శ్రేష్ఠమయిన కస్తూరియందు, నిల్వన్ నేర్చునే - నిలుచుటకు ఇష్టపడునా?

తా. భాస్కరా! తగనివానిదగ్గఱకుఁ దగనివాఁడు చేరఁగోరును గాని మంచివాఁడు చెడు తావును జూచుటకును నిష్టపడఁడు. ఎట్లనఁగా, ఈఁగ మలిన ముతోఁగూడి దుర్గంధముగల కురుపుమీఁద వ్రాలియుండఁగోరునుగాని, గౌర వము నిచ్చు కస్తూరిబొట్టుగల ముఖముమీఁద వ్రాలుటకు ఇష్టపడదు.

ఉ. ఏల సమస్తవిద్యల? నొకించుక భాగ్యము గల్గియుండినన్
జాలు; ననేక మార్గముల సన్నుతి కెక్కు; నదెట్లొకో యనన్
ఱాలకు నేక విద్యలు? తిరంబుగ దేవరరూపు చేసినన్
వ్రాలి నమస్కరించి ప్రసవంబులు పెట్టరె మీఁద? భా.25

టీ. భాస్కరా! సమస్త విద్యలన్ - అన్ని చదువులతో, ఏల? - ఎందుకు? (లాభమేమి?), ఒకించుక - కొంచెము, భాగ్యము గల్గియుండినన్ - అదృష్టము ఉండినయెడల, అనేక మార్గములన్ - పలుత్రోవలచేత, సన్నుతికిన్ - పొగడ్తకు, ఎక్కున్ - అతిశయించును, అది + ఎట్లు + ఒకో + అనన్ - అది ఎటులనఁగా, ఱాలకున్ - ఱాళ్ళకు, విద్యలు - చదువులు, ఏవన్? - ఎక్కడివి? తిరంబుగన్ - స్థిరముగా, దేవరరూపు - దేవునియొక్క ఆకారమును, చేసినన్ - చేసినప్పుడు, వ్రాలి - శ్రద్ధకలిగి (సాష్టాంగపడి), మీఁదన్ - పైన, ప్రసవంబులు - పుష్పములు, పెట్టరె? - ఉంచరా?

తా. భాస్కరా! సకలవిద్యలు రావలసిన పనియేమిగలదు? అదృష్ట ముండినచో ననేక విధములుగాఁ గీర్తిగాంచఁగలదు. శిలలకు విద్యవచ్చునా? దేవతా రూపమున శిలలను సిద్ధము చేసినయెడల, నెల్లవారును దగ్గఱఁజేరి సాష్టాంగ నమస్కారము గావించి పుష్పములు పెట్టి పూజింపక యుందురా?

ఉ. ఒక్కఁడెచాలు నిశ్చలబలోన్నతుఁ డెంతటికార్య మైనఁ దాఁ
జక్క నొనర్పఁ; గౌరవు లసంఖ్యులు పట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబల సేన ననేకశిలీముఖంబులన్
మొక్కపడంగఁ జేసి తుదముట్టఁడె యొక్కకిరీటి? భా. 26

టీ. భాస్కరా! ఎంతటి కార్యమైనన్ - ఎటువంటి కార్యమైనను, ఒనర్పన్ - నెఱవేర్చుటకు, నిశ్చలబలోన్నతుఁడు - దిట్టమైన బలము గలవాఁడు, ఒక్కఁడే చాలున్ - ఒకఁడే చాలును, ఒక్క కిరీటి - ఒక అర్జునుఁడే, కౌరవులు - దుర్యోధనాదులు, అసంఖ్యులు - పెక్కుమంది, పట్టిన - పట్టుకొనిన, ధేనుకోటులన్ - ఆవులమందలను, చిక్కఁగనీక - దొరకనీయకుండునట్లుగా, తత్ప్రబలసేనన్ - ఆ కౌరవులయొక్క బలముగల సైన్యమును, అనేక శిలీముఖంబులన్ - పెక్కు బాణములచేత, ఉక్కడఁపఁగన్ + చేసి - ఓడించి, తుదముట్టఁడె - గెలువఁడే, కార్యము నెఱవేర్పలేదా?

తా. భాస్కరా? ఎంత గొప్పకార్యమయినను నెఱవేర్చుటకు నిజమయిన బలశాలి యొకఁడు చాలును. దుర్యోధనాదులగు కౌరవు లనేకులు గోవులను బట్టుకొనినను, వారి సైన్యములను, వారిని గెలిచి, యర్జునుఁడొక్కఁడే గోవులను మఱలించెఁ గదా?

26. కిరీటి - గోవుల మఱల్చుట.

పాండవులలో అర్జునునకుఁ గిరీటియను నామధేయము కలదు. ఇంద్రుఁడు మెచ్చియిచ్చిన కిరీటముగలవాఁడు కనుక నాపేరు వచ్చెను. పాండవులు పాండురాజు కుమారులు; తల్లి కుంతీదేవి. కిరీటికి తమ్ములు నకుల సహదేవులు. అన్నలు ధర్మరాజు, భీముఁడు ననువారు. పాండవుల ధర్మపత్ని ద్రౌపది. దుర్యోధనుఁడు పాండురాజు అన్నకొడుకు. పాండవులకు రాజ్యము లేకుండఁ జేయవలయునని దుర్యోధనుఁడు మేనమామయగు శకునితో మాయాద్యూతము నాడించి ధర్మరాజు నోడించి ద్రౌపదితోను, నతని యనుజులతోను నరణ్యవాసము పండ్రెండేండ్లును, నొక్కయేఁ డజ్ఞాతవాసమును జేయునట్లు పంపెను. అరణ్యవాస మయిన తర్వాతఁ బాండవులు విరాటరాజుపురమున నున్నారని సంశయించి దుర్యోధనుఁడు వారిని ప్రతిజ్ఞావిహీనులఁ జేయవలయునని భీష్ముఁడు, ద్రోణుఁడు, అశ్వత్థామ, కృపాచార్యులు, కర్ణుఁడు, దుశ్శాసనుఁడు మొదలయినవారిని, చతురంగబలములను సాయముగఁగొని విరాటుని గోవుల మందలను ముట్టడించెను. ఆ సమయమున విరటుని పట్టణమునకు దక్షిణ దిక్కుననున్న గోవులమందలను

ఉ. కట్టడఁ దప్పి తాము చెడుకార్యముఁ జేయుచు నుండిరేని దోఁ
బుట్టినవారినైన విడిపోవుట కార్యము; దుర్మదాంధ్యముం
దొట్టిన రావణాసురునితో నెడఁబాసి విభీషణాఖ్యుఁడా
పట్టున రాముఁ జేరి చిర పట్టము గట్టుకొనండె! భా. 27

టీ. భాస్కరా! కట్టడన్ - మర్యాదను, తప్పి - అతిక్రమించి, తాము, చెడుకార్యమున్ - చెడ్డపనిని, చేయుచునుండిరేని - చేయుచుండిన యెడల, తోఁబుట్టినవారినైనన్ - అన్నదమ్ముల నైనప్పటికిని, విడిపోవుట - వదలి పెట్టుట, కార్యము - మంచిపని (చేయఁదగినది), విభీషణాఖ్యుఁడు - విభీషణుఁ డనువాఁడు, దుర్మదాంధ్యమున్ - అహంకారముచేతఁ గన్నులు గానకుండు టను, దొట్టిన - పొందిన, రావణాసురునితోన్ - అన్నయగు రావణునితో, ఎడఁబాసి - విడిచిపెట్టి (వేఱయి), ఆపట్టునన్ - ఆ సమయముననే, రాముఁ జేరి - శ్రీరామమూర్తిదగ్గఱఁ జేరి, చిరపట్టమున్ - స్థిరమయిన పట్టాభిషేకమును, కట్టుకొనండె - కట్టుకొనలేదా?

తా. భాస్కరా! మర్యాద యెఱుంగక యన్యాయముగాఁ జెడ్డపనులను జేయుచుండినవాఁడు తోడఁబుట్టువుగా నుండినను వానిని వదలిపోవుట మంచిది. రావణాసురుఁడు గర్వముతోఁ గన్నుఁగానక యుండఁగా విభీషణుఁడు వదలిపెట్టి శ్రీరామునిఁ జేరి లంకాపురమునకు స్థిరమయిన రాజుగా నయ్యెఁగదా?

---

దుర్యోధనుని ప్రోత్సాహముచేత సుశర్మ ముట్టడించియుండెను. సుశర్మ నోడించి యావుల మఱలించుటకై విరాటుఁడు సైన్యముతోఁగూడ ధర్మరాజు, భీముఁడు, నకుల, సహదేవులతో వెళ్ళియుండెను. ఉత్తరమునఁ గౌరవులు ముట్టడించుటచేఁ బట్టణమున నెవరులేక యుత్తరుఁడు కిరీటితోఁగూడఁ బోయెను. ఉత్తరుఁడు కౌరవసైన్యముఁ జూచి భయపడి పాఱిపోవుచుండఁ గిరీటి తమ యజ్ఞాతవాస కాలము ముగిసినదని గుర్తెఱిఁగి యుత్తరుని జయప్రదీర్చి తానే రథికుఁడై కౌరవ బలమునెల్ల నోడించి యావుల మందలను మఱలించెను. బలాధికుఁ డొక్కఁడే చాలు నెంతటి కార్యమయిన నొనర్చుట కనుట కిది యుదాహరణము.

ఉ. కట్టడ యైనయట్టి నిజకర్మము చుట్టుచువచ్చి యేగతిం
బెట్టునొ? పెట్టిన ట్లనుభవింపక తీఱదు; కాళ్ళు మీఁదుగాఁ
గట్టుక వ్రేలఁ డంచుఁ దల క్రిందుగఁ గట్టిరె యెవ్వరైన నా
చెట్టున గబ్బిలంబులకుఁ జేరిన కర్మము గాక భా. 28

టీ. కట్టడయైనయట్టి - తప్పక జరుగనున్నట్టి, నిజకర్మము - తాను చేసిన పుణ్యపాపముల ఫలము, చుట్టుచువచ్చి - చుట్టుకొనుచు వచ్చినదై, ఏగతిన్ - ఏవిధముగా, పెట్టునో? పెట్టినట్లు - కలుగఁజేసినట్లు, అనుభవింపక తీఱదు - అనుభవింపక తొలఁగదు, కాళ్ళు - కాళ్ళను, మీఁదుగా - పైకి, కట్టుక-కట్టుకొని, వ్రేలుఁడు - వ్రేలాడవలసినది, అంచున్ - అని, తలక్రిందుగన్ - క్రిందుమీఁదుగ, ఎవ్వరైనన్ - ఎవరైనను, ఆ చెట్టునన్ - చెట్టుకొమ్మలను, కట్టిరె?-కట్టినారా? గబ్బిలంబులకు - గబ్బిలమను పక్షులకు, చేసిన కర్మము గాక - చేసిన పాపఫలము గాక.

తా. భాస్కరా! విధినిర్మిత మయినట్టి తమ ఫలము చుట్టుకొని యెట్లు త్రిప్పునో తప్పక యట్లే యనుభవింపవలెనుగాని, తప్పించుకొన వీలులేదు.

---

27. రావణుఁడు - విభీషణుఁడు.

విశ్రవో బ్రహ్మకుమారులు రావణుఁడు, కుంభకర్ణుఁడు, విభీషణుఁడు. రావణుఁడు బ్రహ్మచే వరములుగొని లోకములను బాధించుచు నంతులేని యిబ్బందులలో ముంచుచుండెను. కుంభకర్ణుఁడును దుర్మార్గుఁడే కాని నిద్రపోతై మంచిచెడ్డలఁ దలంపకుండెను. విభీషణుఁడు సద్గుణాఢ్యుఁడు. అన్నయగు రావణున కెన్నినీతులు చెప్పినను వ్యర్థమగుచుండెను. రావణుఁడు దిక్పాలకుల బాధించెను, స్త్రీలను జెఱపెట్టెను, మితిలేని చెడ్డపనులు గావించెను. శ్రీరాముని భార్యయగు సీతాదేవి నపహరించెను. శ్రీరాముఁడు వానర సైన్యముతో వచ్చి లంకాపట్టణమును ముట్టడించెను. ఆ సమయమున విభీషణుఁడు అన్నకు హితము చెప్పెను. రావణుఁడు వినకపోయెను. అపుడు విభీషణుఁడు అన్నయని యెంచక విడిచి శ్రీరామచంద్రుని శరణుఁజొచ్చి చిరకీర్తిని పొందెను. రావణుఁడు శ్రీరామునిచే నశించెను.

గబ్బిలములు చేసికొన్న పాపఫలమువలననే గాని, యెవరయినఁ దలక్రిందుగా వ్రేలాడవలసిన దని చెట్లకుఁ గట్టిరా ?

ఉ. కట్టడ లేనికాలమునఁ గాదు శుభం బొరు లెంతవారు చే
పట్టిన నైన; మర్త్యునకు భాగ్యము రాదను టెల్లఁ గల్ల కా
దెట్టని పల్కినన్, దశరథేశవసిష్ఠులు రామమూర్తికిన్
బట్టము కట్టఁ గోరి; రది పాయక చేకుఱె నోటు! భా. 29

టీ. భాస్కరా! కట్టడలేని కాలమునన్-దైవముయొక్క యేర్పాటులేని కాలమునందు, ఎంతవారు - ఎంతశక్తిగల, ఒరులు - ఇతరులు, చేపట్టిననైనన్ - సాయపడినప్పటికిని, కల్పించుకొనినను, శుభంబు - మేలు, రాదు + అనుట + ఎల్లన్ - రాదనుటయంతయు, కల్లకాదు - అబద్ధముకాదు, ఎట్టు అని పల్కినన్ - ఎటులయనఁగా, దశరథేశ - దశరథరాజు, వసిష్ఠులు - వసిష్ఠ మహర్షియును, రామమూర్తికిన్ - శ్రీరామునకు, పట్టము - పట్టాభిషేకము, కట్టన్ + కోరిరి - చేయఁగోరిరి, అది - ఆ కార్యము, పాయక - తొలఁగిపోక, చేకుఱె నోటు - నెఱవేఱెనా ?

తా. భాస్కరా ! దైవముయొక్క యేర్పాటు లేకున్నచో నెంతశక్తిగల యితరులు పూనుకొనినను మేలు కలుగదు. భాగ్యము రాదు; ఇది నిక్కము. దశరథమహారాజు, వసిష్ఠమహర్షి ప్రయత్నించినప్పటికిని శ్రీరామునకుఁ బట్టాభిషేకము చేయఁజాలక పోయిరి కదా ?

---

29. శ్రీరాముని పట్టాభిషేక యత్నము.

దశరథునకు ముగ్గురు భార్యలు - కౌసల్య, కైక, సుమిత్ర యనువారు. కౌసల్యకు శ్రీరామచంద్రుఁడు, కైకకు భరతుఁడు, సుమిత్రకు శత్రుఘ్నుఁడు, లక్ష్మణుఁడు పుత్త్రులు. వీరు వసిష్ఠమహాముని దగ్గఱ విద్యాభ్యాసము చేసిరి. శ్రీ రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట వెళ్ళి, తాటకను జంపి, మారీచ సుబాహులను గెలిచి మునియజ్ఞము పూర్తిగావించిరి. జనకమహారాజు పట్టణమగు మిథిలకు వెళ్ళుచు మార్గమున అహల్యకు శాపవిమోచనము చేసిరి. శివధనుస్సును

ఉ. కానక చేరఁబోల దతి ♦ కర్ముఁడు నమ్మిక లెన్ని చేసినన్;
దానది నమ్మి వానికడ ♦ డాయఁగఁబోయిన హానివచ్చు న
చ్చోఁ; నది యెట్లనన్, గొఱఁకు ♦ చూపుమ నొడ్డినబోను మేలుగా
బోనని కానకాసపడి ♦ పోవుచుఁ గూలదె కొక్కు భా. 30

టీ. భాస్కరా! అతికర్ముఁడు - చెడ్డపనులు చేయువాఁడు, నమ్మికలు - ఆశలు, ఎన్నిచేసినన్ - ఎన్నిచేసినప్పటికిని, కానక - విచారింపక, చేరన్ + పోలదు - దగ్గఱఁజేరరాదు, తాన్ - తాను, అదినమ్మి - చెడ్డవానిమాటలను నమ్మి, వానికడన్ - వానిదగ్గఱకు, డాయన్ - సమీపింపఁగా, పోయినన్ - పోయినయెడల, అచ్చోన్ - అచ్చోట, హాని - కీడు, వచ్చున్ - వచ్చును, అది+ఎట్లు+అనన్ - అదెట్లనఁగా, కొఱఁకు - ఆహారము, చూపుమన్, మేలుగా - బాగుగా, బోను - పట్టుకొను సాధనము, ఒడ్డినన్ - ఉంచఁగా, బోను+అని+కానక - తనను చంపు బోనని చూడక, ఆసపడి - ఆశించి, పోవుచున్ - వెళ్ళుచు, కొక్కు - పందికొక్కు, కూలదె? - చావదా?

తా. భాస్కరా! దుర్మార్గుఁడు ఎన్ని నమ్మకములు చెప్పినను వాని విషయములను చక్కఁగా విచారింపక దగ్గఱఁ జేరరాదు, నమ్మిచేరినచో తప్పక కీడు కలుగును. ఎట్లనఁగా ఆహారము ఉంచి బోనుపెట్టఁగాఁ గొక్కు ఇది బోను అని తెలియఁజాలక ఆశపడి చచ్చును గదా?

---

విఱిచి జనకునికూఁతురగు సీతాదేవినిఁ బెండ్లియాడుటయే కాక శ్రీరాముఁడు తన తమ్ములకును జనకుని కుమార్తెలను బెండ్లియగునట్లు చేసెను. కల్యాణానంతరము అయోధ్యకుఁ జేరిరి. కొంతకాలమునకు శ్రీరాముని పట్టాభిషేకము దశరథమహారాజు నిశ్చయించెను. వసిష్ఠుఁడు — బ్రహ్మర్షి యా కార్యమును జేయ సంకల్పించె. మంథరయను కైకదాసి కైకకు దుర్బోధచేసి పట్టాభిషేక భంగమును చేసెను. పట్టాభిషేకము జరుగుట యటులుండఁగా శ్రీరాముఁడు భార్యతోను, దమ్ముఁడగు లక్ష్మణునితోడను అరణ్యమునకుఁ బోవలసివచ్చెను. విధిలే నప్పుడు ఎంతప్రయత్నించినను, ఎంతవారు యత్నించినను గార్యములు గావు.

ఉ. కాని ప్రయోజనంబు సమ♦కట్టదు తా భువి నెంతవిద్యవాఁ
డైనను; దొడ్డరాజుకొడు ♦ కైన; నదెట్లు ? మహేశుపట్టి వి
ద్యానిధి, సర్వవిద్యలకుఁ♦దానె గురుండు, వినాయకుండు దా
నేనుఁగురీతి నుండియు న♦దేమిటి కాడఁడు పెండ్లి? భా. 31

టీ. భాస్కరా! కానిప్రయోజనంబు - కానిపని, భువిన్ - భూమియందు, తాన్ - తాను, ఎంత విద్యవాఁడు + ఐనను - ఎంతగాఁ జదువు వచ్చినవాఁడయినప్పటికిని, దొడ్డరాజు - గొప్ప ప్రఖ్యాతిగల రాజకుమారుఁడు, ఐనను, సమకట్టదు - నెఱవేఱదు, అది + ఎట్లు - ఏవిధముగా, మహేశుపట్టి - ఈశ్వరుని కుమారుఁడును, విద్యానిధి - విద్యలకు ఆధారము అయినవాఁడును, తానె, విద్యలకున్, గురుండు - ఉపదేశకుఁడు, ఏనుఁగువలె, ఉండియును, వినాయకుండు - విఘ్నేశ్వరుఁడు, అదేమిటికి - అదేకారణముచేత, పెండ్లి ఆడఁడు - పెండ్లిచేసికొనఁడు ?

తా. భాస్కరా! లోకములోఁ దా నెంత విద్యావంతుఁ డయినను, గొప్ప రాజునకుఁ బుత్త్రుఁడయినను కాని కార్యము నెఱవేర్చుకొనలేఁడు. ఎట్లనఁగా విఘ్నేశ్వరుఁడు, తాను శంకరుని పుత్త్రుఁడై, విద్యానిధియై, విద్యలకు గురువై, ఏనుఁగువలె నుండికూడ పెండ్లి చేసికొనలేక యున్నాఁడు.

ఉ. కామితవస్తుసంపదలు ♦ గల్గు ఫలం బొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి♦యేటికి? నిష్ఫల; మున్నఁబోయినన్
బ్రామికపడ్డ; లోకులకుఁ♦బండఁగ నే మది యెండి పోవఁగా
నేమిఫలంబు? చేఁదు విడ♦దెన్నటికైన ముసిండి భా. 32

టీ. భాస్కరా! ఒరులు - ఇతరులు, కామిత వస్తుసంపదలు - కోరిన వస్తువులయొక్క భాగ్యములు, గల్గు - కలుగునట్టి, ఫలంబు - లాభము, ఆస పడ్డచోన్ - కోరినయెడల, ఏమియున్ - కొంచెమయినను, పెట్టఁడేని - ఇయ్యకపోయినను, సిరి - సంపద, నిష్ఫలంబు - ఉపయోగములేనిదే, ఉన్నన్ - ఉండినను, పోయినన్ - నశించినను, ప్రామికపడ్డన్ - మోస

పోయినను, ఏటికి ? - ఏల, ముసిండి - ముష్టిచెట్టు, పండ౯ఁగ నేమి - పండినను, అది, ఎండిపోవఁగాన్ - అది ఎండినను, లోకులకున్ - జనులకు, ఏమి ఫలంబు - ఏమి లాభము? ఎన్నటికైనన్ - ఎప్పటికైనను, చేఁదు, విడువదు - వదలిపెట్టదు.

తా. భాస్కరా! లోకులకుఁ గోరిన వస్తువులను నిష్టపడిన యెడల నే కొంచెమయినను నియ్యనివాని సంపద యున్నను, నశించినను, నే మయినను నుపయోగములేనిదే యగును. ముష్టిచెట్టు పండినను, నెండినను ప్రజలకు లాభము కలదా? దాని చేఁదెప్పుడును వదలదు.

ఉ. కారణ మైనకర్మములు♦కాక దిగంబడ వెన్నిగొందులం
దూఱిన నెంతవారలకుఁ; ♦ దొల్లి పరీక్షితుశాపభీతుఁ డై
వారిధి నొప్పు నుప్పరిగ ♦ పైఁ బదిలంబుగ డాఁగియుండినం
గ్రూర భుజంగదంతహతిఁ♦గూలఁడె లోకులెఱుంగ? భా. 33

టీ. ఎంత వారలకున్ - ఎంతటి గొప్పవారలకైనను, కారణమైన కర్మములు - కారణముగా నుండు పనులు, ఎన్ని గొందులన్ దూఱినన్ - ఏ సందు గొందులు చేరినప్పటికిని, కాక - జరుగక, దిగంబడవు - పోఁజాలవు, తొల్లి - పూర్వము, పరీక్షితు - పరీక్షిత్తు అనురాజు, శాపభీతుఁడై - శాపమునకు భయపడినవాఁడై, వారిధిన్ - సముద్రమునందు, ఒప్పు - తగిన, ఉప్పరిగపైన్ - మేడమీఁద, పదిలంబుగన్ - భద్రముగా, డాఁగియుండినన్ - దాఁచిపెట్టుకొని యున్నప్పటికిని, లోకులు - జనులు, ఎఱుంగన్ - తెలిసికొనునట్లు, క్రూర - భయంకరమగు, భుజంగ - పాముయొక్క, దంతహతిన్ - కోరల కాటుచేత, కూలఁడె - చావఁడా ?

తా. భాస్కరా! ఎంత గొప్పవారికిఁ గాని, యెచ్చట దాఁచిపెట్టుకొన్నప్పటికిని దాముచేసిన కార్యములకుఁ దగిన ఫలము కలుగుచునేయుండును. కాని తప్పిపోఁజాలదు. పూర్వము పరీక్షిన్మహారాజు శమీకుని కొడుకగు శృంగియొక్క శాపమునకు భయపడి సముద్రములో మేఁడఁ గట్టించుకొని యుండినప్పటికిని, సర్పముచేఁగఱవఁబడి చనిపోవుట లోకులకు స్పష్టముగఁ దెలిసినదే.

చ. కులమున నక్కడక్కడ నకుంఠితధార్మికుఁ డొక్కఁడొక్కఁడే
కలిగెడుఁగాక, పెందఱుచుఁ గల్గఁగ నేరరు; చెట్టుచెట్టునన్
గలుగఁగ నేర్చునే గొడుగుకొమ్ములు చూడఁగ నాడనాడ నిం
పలరఁగ నొక్కటొక్కటి నయంబునఁ జేకుఱుఁగాక! భా. 34

టీ. భాస్కరా! కులమునన్ - వంశమునందు, అక్కడక్కడన్, అకుంఠిత - స్థిరమైన, ధార్మికుఁడు - ధర్మబుద్ధి గలవాఁడు, ఒక్కఁడొక్కఁడే - ఎవఁడో యొకఁడు, కలిగెడుఁగాక - ఉండును గాని, పెందఱుచు - సాధారణముగా (విస్తారముగా), కల్గఁగ నేరరు - పుట్టఁజాలరు; చెట్టుచెట్టునన్ - ఒక్కొక్క చెట్టునందును, గొడుగుకొమ్ములు - గొడుగులకుఁ గావలసిన కొయ్యలు, కలుగఁగ నేర్చునే - ఉండునా? చూడఁగన్, ఆడనాడ - అక్కడక్కడ, ఇంపలరంగన్ - బాగుగా, ఒక్కటొక్కటి, నయంబుగన్ - యుక్తిగ, చేకుఱుఁగాక - లభించును గదా?

33. పరీక్షితుఁడు - పాము కఱచుట.

పాండవులలో నర్జునుని కుమారుఁ డభిమన్యుఁడు. అభిమన్యునకు నుత్తర యందు జనియించినవాఁడే పరీక్షిత్తు. ఇతఁడు పాండవుల యనంతరము రాజ్య పాలనము చేసినవాఁడు. ఇతఁడు రాజ్యము చేయుసమయమున వేటకు నొక నాఁడు పోయి యలసి దప్పిగొని శమీకుఁ డను ముని ధ్యానమున మైమఱచి యుండఁగాఁ బోయి జల మడిగెను. సమాధిలోనుండిన ముని పలుకఁడయ్యెను. రాజు కోపించి యొక చచ్చినపామును ముని మెడలో వేసి వెళ్ళెను. శమీక ముని కొడుకు శృంగి యాశ్రమమునకు వచ్చి తండ్రి మెడలోని పామును జూచి కోపించి దీనిని వేసినవాఁ డేడు దినములలో మృతినొందునని శాపము పెట్టెను. ఈ శాప విషయమును శమీకముని సమాధినుండి లేచి తెలిసికొని రాజునకుఁ దెలియఁజేసెను. పరీక్షిత్తు శాపమును దప్పించుకొనవలయు నని సముద్రమున నొక మేడఁ గట్టించి కావలియుంచి యందుఁ దాను గాఁపురముండెను. ఏడవ దినమున బ్రాహ్మణుఁడు తెచ్చి యాశీర్వదించి కానుకగా నిచ్చిన నిమ్మపండును వాసనచూడఁగా నా పండునందుఁ గ్రిమిరూపమున నున్న తక్షకుఁ డను పాము కఱవఁగా మృతినొందెను. ఎక్కడ నున్నను గర్మఫల మనుభవింపక తప్పిపోదు.

తా. భాస్కరా! కులమునం దక్కడక్కడ ధర్మబుద్ధిని తప్పనివాఁ డెవ్వఁడో యొక్కఁడు పుట్టఁగలఁడు కాని యంతట నుండరు. ప్రతివృక్షము నందును గొడుగులకుఁ దగిన కాడలు పుట్టవు. ఎక్కడనో యొక్క చెట్టునఁ జక్కని కాడ యొకానొకటి పుట్టును.

ఉ. క్రూరమనస్కులౌ పతులఁ గొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబె పట్టి, చెడువర్తన పాటిలు; మాధురీ జలో
దారలు గౌతమీముఖమహానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁజెందవే? మొదలికట్టడ లన్నియుఁ దప్పి భా. 35

టీ. భాస్కరా! క్రూరమనస్కులు + ఔ - చెడ్డ మనస్సుగల, పతులన్ - అధికారులను (రాజులను), కొల్చి - సేవించి, వసించిన - ఉండిన, మంచివారికిన్, వారి గుణంబె - ఆ చెడ్డవారిగుణమె, పట్టి - కలిగి, చెడువర్తన - చెడ్డనడవడి, పాటిలున్ - కలుగును, మాధురీ జలోదారలు - తియ్యని నీటిచే గొప్పవయిన, గౌతమీ ముఖ మహానదులు - గోదావరి మొదలయిన గొప్ప నదులు, అంబుధిన్ - సముద్రమును, కూడిన + అంతనే - చేరఁగానే, మొదలి కట్టడలు - మొందున్న మర్యాదలు, అన్నియున్ + తప్పి - అన్నియు వదలి, క్షారమున్ - ఉప్పును, చెందవే - పొందవా?

తా. భాస్కరా! చెడ్డగుణములు గలవారిని సేవించిన మంచివారికిఁ గూడ వారిగుణమే పట్టుపడి చెడ్డనడవడి కలుగఁగలదు. తియ్యని జలము గల గొప్పగొప్ప గౌతమి మొదలగు నదులు సముద్రమును జేరఁగానే తమ స్వగుణమగు తీయనిరుచిని బోఁగొట్టుకొని, సముద్రగుణమగు ఉప్పనిరుచిని బొందుచున్నవి గదా!

ఉ. గిట్టుట కేడఁ గట్టడ లిఖించిన నచ్చటఁగాని యొండుచోఁ
బుట్టదు చావు; జానువులపున్కల నూడిచి కాశిఁ జావఁ గా
లట్టిన శూద్రకున్ భ్రమలఁ గప్పుచుఁదద్విధి గుజ్జమాచు నా
పట్టునఁగొంచు మజ్జికడఁ బ్రాణముదీసెఁగదయ్య! భా. 36

టీ. భాస్కరా! గిట్టుటకున్ - చచ్చుటకు, ఏడన్ - ఎక్కడ, కట్టడ- దైవము, లిఖించినన్ - వ్రాసియుండిన, అచ్చటఁగాని - అక్కడనేగాని, ఒండుచోన్ - మఱియొకచోట, చావు పుట్టదు - చావు కలుగదు, జానువుల పుర్రెలన్ - మోఁకాలి చిప్పలను, ఊడిచి - తీసి, కాశిన్ - కాశీపట్టణమునందు, చావన్ - చచ్చుటకు, కాల్కట్టిన - సిద్ధపడిన, శూద్రకున్ - శూద్రకుఁడనురాజును, భ్రమలన్ - మాయచే, కప్పుచున్ - కప్పినవాఁడై, తద్విధి - ఆ దైవము, గుఱ్ఱము, ఔచున్, ఆ పట్టునన్ - ఆవేళను, మఱ్ఱికడన్ - మఱ్ఱిచెట్టు దగ్గఱను, కొంచున్ - చేర్చుచు, ప్రాణమున్+తీసెన్ + కద + అయ్యా - ప్రాణము పోవునట్లు చేసెను.

తా. భాస్కరా! భగవంతుఁ డెక్కడఁ జచ్చుట కేర్పాటు చేయునో అచ్చటనే గాని మఱియొకచోటఁ జావుగలుగదు. శూద్రకుఁడు కాశీపురియందు జావవలెనని ప్రయత్నించి పోఁగా దైవము గుఱ్ఱమై యొక మఱ్ఱికడకుఁజేర్చి యక్కడనే ప్రాణమును దీసినది. తలఁచినచోటఁ జావలేకపోయెను. బ్రహ్మవ్రాఁతకు మార్పుకలుగదు. అది తెలియఁబడదు.

చ. ఘనబలసత్త్వమచ్చుపడఁ ♦ గల్గినవానికి హాని లేనిచోఁ
దనదగుసత్త్వమే చెఱుచుఁ♦దన్ను; నదెట్లన? నీరు మిక్కిలిన్

---

36. శూద్రకుఁడు - కాశీయాత్ర - మధ్యేమృతి.

శూద్రకుఁ డొక రాజు. ఇతఁడు కాశీపురియందు మరణించిన ముక్తి కలుగునని యెంచి కాశీపురమునకు వెళ్ళి యందుఁ గాఁపుర ముండెను. కాళ్ళు స్వాధీనములో నుండిన నెచటికైన వెళ్ళవలసి వచ్చునేమోయని మోఁకాటి చిప్పల నూడఁదీసి పడియుండెను. ఒకదినమున కాశీపురపు రాజా ఒక గుఱ్ఱమును దెప్పించి యాగుఱ్ఱ మెవరికిని స్వాధీనము కాక పోవుటచే నీ గుఱ్ఱముమీఁద సవారిచేయువానికి బహుమాన మిత్తునని చాటించెను. శూద్రకుఁ డీవార్తఁదెలిసికొని తాను గుఱ్ఱపుస్వారి చేయుటలో నేర్పుగలవాఁడు కావున నితరుల తోడ్పాటుచే గుఱ్ఱముమీఁదికి నెక్కి సవారిచేయుటకుఁ బోయెను. ఆ యసాధ్యమైన గుఱ్ఱ మాశూద్రకుని గొని మహావేగముగాఁ బోవుచు నొక యడవిలో నొక మఱ్ఱిచెట్టునకుఁ గొట్టి చంపెను. శూద్రకుని తలంపేమి, జరిగినదేమి? కావున చావు నిర్ణయించినచోటు దాఁటుట యసాధ్యము.

గను వసియించినఁ జెఱువు♦కట్టకు సత్త్వము చాలకున్నచోఁ
గనుమలు పెట్టి నట్టనడి♦గండి తెగంబడకున్నె ! భా. 37

టీ. భాస్కరా! ఘనబలసత్త్వము - గొప్పబలముతోఁ గూడిన సత్తువ, అచ్చుపడన్ - బాగుగా, కలిగినవానికిన్ - ఉండినవానికి, హాని - కీడు, లేనిచోన్ - లేకున్నయెడల, తనదిఅగుసత్త్వమే - తనకున్న బలమే, తన్నున్ + చెఱచున్ - తనను చెడఁగొట్టును. అది, ఎట్లు, అనన్, నీరు, మిక్కిలిన్ - అధికముగా, వసియించినన్, - ఉండినయెడల, చెఱువుకట్టకున్, సత్వము - బలము, కనుమలు - గుంతలు, పెట్టి - పడి, నట్టనడిన్ - నట్టనడుమ, గండి - రంధ్రము, తెగంబడక - తెగిపోవక, ఉన్నె - ఉండునా ? (తెగునని భావము)

తా. భాస్కరా ! ఎక్కువ బలవంతుఁడయినవానికి, ఇతరులవలన హాని లేక పోయినయెడల, తనబలమే తనకుఁ గీడు కలిగించును. ఎట్లనఁగా, మిక్కుటముగా నీ రుండినచోఁ గట్టకు బలము లేకయుండిన చెఱువుకట్టనడుమ గుంతలుపడి తెగిపోవునుగదా ?

చ. ఘనుఁడగునట్టివాఁడు నిజ♦కార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవునిఁ ♦ బ్రార్థనఁజేయుట తప్పుగాదు గా
యనఘతఁ గృష్ణజన్మమున♦నావసుదేవుఁడు మీఁదు మెత్తుగాఁ
గనుఁగొని గాలిగాని కడ♦కాళ్ళకు మ్రొక్కఁడె నాఁడు భా. 38

టీ. భాస్కరా! ఘనుఁడగునట్టివాఁడు - గొప్పవాఁడగు మనుజుఁడు, నిజకార్య - తన పని యొక్క, సముద్ధరణార్థము + ఐ - నెఱవేర్చుకొనుట కొఱకు, మహిన్ - భూమియందు, పనివడి - ప్రయత్నముచేసి, అల్పమానవుని - నీచుని, ప్రార్థనచేయుట - వేఁడుకొనుట, తప్పుకాదుగా - తప్పుకాదుగదా! అనఘతన్ - పాపములేని స్వభావము కలుగుటవలన, కృష్ణజన్మమునన్ - కృష్ణమూర్తి పుట్టిన కాలమునందు, ఆ వసుదేవుఁడు, మీఁదు మెత్తుగాన్ - తలకు శ్రేష్ఠమయిన భూషణముగా, కనుఁగొని - చూచి, నాఁడు - ఆదినమున, గాలిగాని - గాడిదయొక్క, కడకాళ్ళకున్ - పాదములకు, మ్రొక్కఁడె - నమస్కరింపఁడా ? (నమస్కరించెను.)

తా. భాస్కరా: ఎంతటి గొప్పవాఁడయినను, తనకార్యము నెఱవేర్చుకొనుటకై యత్నముతో నీచుని ప్రార్థించుట తప్పుగాదు. శ్రీ కృష్ణమూర్తి పుట్టిన కాలమున వసుదేవుఁడు గాడిదకాళ్ళను శిరోభూషణముగా నెంచుకొని నమస్కారములు చేసినాఁడు కదా?

చ. ఘనుఁ డొకవేళఁ గీడ్పడిన(ఁ)గ్రమ్మఱ నాతని లేమి వాపఁగాఁ
గనుగొన నొక్కసత్ప్రభువు(ఁ)గాక నరాధము లోప రెందఱుం;
బెనుఁజెఱు వెండినట్టితఱి(ఁ)బెల్లున మేఘుఁడు గాక, నీటితోఁ
దనుపఁ మహాశముల్ శతశ(ః)తంబులు చాలునఁటయ్య!భా. 39

టీ. భాస్కరా! ఘనుఁడు - గొప్పవాఁడు, ఒకానొక కాలమునందు, కీడ్పడినన్ - కీడుచే పట్టఁబడిన, క్రమ్మఱన్ - మరల, ఆతని లేమి - వాని బీదతనమును, పాపఁగాన్ - పోఁగొట్టుటకు, కనుఁగొనన్ - విచారింపఁగా, ఒక్క సత్ప్రభువుకాక - ఒక మంచిరాజేకాక, ఎందఱున్ - ఎందఱైనను, నరాధములు - నీచులగు మనుష్యులు, ఓపరు - తట్టుకొనఁజాలరు. పెనుచెఱువు - గొప్పచెఱువు, ఎండినట్టి తఱిన్ - నీరులేని సమయమున, పెల్లునన్ - వెంటనే,

38. వసుదేవుఁడు - గాడిదకాళ్ళు పట్టుకొనుట.

చంద్రవంశపురాజు వసుదేవుఁడు. ఇతఁడే శ్రీ కృష్ణునకును, బలరామునకును దండ్రి; కంసునకు బావ. ఆకాశవాణి వాక్యములను విని చెల్లెలగు దేవకీదేవిని, బావయగు వసుదేవుని చెఱలోనుంచెను. దేవకీదేవికిఁ జెఱసాలలో శ్రీ కృష్ణమూర్తి జన్మించెను. వసుదేవుఁడు శ్రీ కృష్ణమూర్తిని వ్రేపల్లెలో నందుని యింట యశోద ప్రక్కన నుంచి కంసునకుఁ దెలియకుండ కావలయునని తలఁచెను. ఆ నడురేయి యెవరెఱుఁగక యుండునట్లు చప్పుడుచేయక శ్రీ కృష్ణమూర్తిని ఎత్తుకొని పోవుచుండెను. అపు డొక గాడిద మిక్కుటముగా నఱచుచుండెను. అపుడు వసుదేవుఁడు కావలివారలు నిద్రలేచినయెడల తాను జేయు కార్యము చెడునేమోయని భయపడి వెంటనే యా గాడిదకాళ్ళను పట్టుకొని దానిని సమాధానపఱచెను. తనపని నెఱవేర్చుకొనుటకై యల్పుని సేవించిన తప్పుకాదు.

నీటితోన్ + తనుపన్ - నీటిని నింపుటకు, మేఘుఁడుగాక, ఇతరలేంబులు- వేలకు వేలు, తుషారముల్ - మంచుబిందువులు, చాలునఁటయ్య - చాలఁగలవా?

తా. భాస్కరా! లోకములో నొక గొప్పవాఁడు తగ్గిపోయినయెడల వాని లోపమును దీర్చుటకు గొప్పవాఁడే కావలెనుగాని, యల్పులచేత సాధ్యము కాదు. గొప్పచెఱువు ఎండిపోయిన దానిని నీటితో నింపుటకు మేఘుఁడే తగును గాని మంచుబిందువులు ఎన్నియైన నేమి యుపయోగము?

ఉ. చంద్రకళావతంసుకృప•చాలనినాఁడు మహాత్ముఁడైనఁ దా
సాంద్రవిభూతిఁబాసియొక•జాతివిహీనునిఁ గొల్చియుంట,యో
గీంద్రనుతాంఘ్రిపద్మ మతి•హీనత నొందుట కాదుగా; హరి
శ్చంద్రుఁడువీరబాహుని ని•జంబుగఁ గొల్వఁడె నాఁడు?భా. 40

టీ. భాస్కరా! యోగీంద్రనుతాంఘ్రిపద్మ - మునీశ్వరులచే స్తుతింపఁబడిన పాదకమలములు గలవాఁడా! చంద్రకళావతంసు కృప - శంకరుని దయ, చాలనినాఁడు - చాలని దినమునందు, మహాత్ముఁడైనన్, గొప్పవాఁడయినను, తాన్ - తాను, సాంద్రవిభూతి - గొప్పసంపదను, పాసి - తొలఁగి, ఒక, జాతిః హీనునిన్ - కులహీనుఁ డగువానిని, కొల్చి - సేవించి, ఉంట - ఉండుట, మతిహీనత - బుద్ధిలేకుండుట, కాదుగా - కాదుగదా? నాఁడు - ఆ దినమున, హరిశ్చంద్రుఁడు - హరిశ్చంద్రుఁడను చక్రవర్తి, వీరబాహునిన్ - వీరబాహుఁడను మాలవానిని, నిజంబుగన్ - సత్యముగా, కొల్వఁడె - సేవింపఁడా? (సేవించెను)

తా. భాస్కరా! భగవంతుని దయలేని సమయమున నెంతటి వాఁడైనను సంపద నశించి యొకానొక నీచకులమువానిని సేవించియుండుట బుద్ధి లేక కాదు. పూర్వము హరిశ్చంద్రచక్రవర్తి నీచమగుపనులఁ జేయు వీరబాహుని సేవ చేయలేదా? అందుఁ దప్పులేదు.

---

40. హరిశ్చంద్రుఁడు - వీరబాహుఁడు.

చంద్రవంశమునఁ ద్రిశంకుఁడను రాజుండెను. ఆయన కొడుకే హరిశ్చంద్రుఁడు. ఇతని భార్య చంద్రమతి. కుమారుఁడు లోహితాస్యుఁడు (రోహి

ఉ. చక్కఁ దలంపగా విధివశంబున నల్పునిచేతనైనఁ దాఁ
జిక్కి యవస్థలం బొరలుఁజెప్పఁగ రాని మహాబలాఢ్యుఁడున్;
మిక్కిలి సత్త్వసంపదల మీఱిన గంధగజంబు మావటీఁ
డెక్కి యదల్చి కొట్టి కుదియించిన నుండదె యోర్చి? భా. 41

టీ. భాస్కరా! చక్కన్ - బాగుగా, తలంపఁగాన్ - చూడఁగా, మహాబలాఢ్యుఁడున్ - గొప్ప బలము గలవాఁడుకూడ, విధివశంబునన్ - దురదృష్టముచేత, అల్పునిచేతనైనన్ - నీచునకు, తాన్ - ఆ గొప్పవాఁడు, చిక్కి - లోఁబడి, చెప్పఁగరాని, అనేక, అవస్థలన్ - శ్రమలను, పొరలున్ - అనుభవించును, మిక్కిలి సత్త్వసంపదలన్ - ఎక్కువ బలముయొక్క సంపదచేత, మీఱిన - అతిశయించిన, గంధగజంబు - మదించిన యేనుఁగు, మావటీఁడు - మావటీవాఁడు, ఎక్కి, అదల్చి - బెదిరించి, కొట్టి, కుదించినన్ - క్రుంగునట్లు త్రొక్కినప్పటికిని, ఉండదె? - ఉండదా?

తా. భాస్కరా! ఎంత బలముగలవాఁడయినను, దైవమువలన నల్పుని చేతిలోఁబడి చెప్పుటకు సాధ్యముగాని బాధల ననుభవించును. బలము అధికముగాఁగలిగిన మదపుటేనుఁగు కూడ మావటివాఁడు ఎక్కి బెదిరించి యంకుశముతోఁ గ్రుచ్చి కుదింపఁగా బాధ ననుభవించుచుఁ బడియుండుట లేదా?

చ. చదు వది యెంత కల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా
చదువు నిరర్థకంబు, గుణసంయుతు లెవ్వరు మెచ్చ రెచ్చటం;

తుఁడు). హరిశ్చంద్రుఁడు సత్యవంతుఁడు. విశ్వామిత్రుఁ డీ రాజును యాచింపఁగా ధనమిచ్చెద నని వాగ్దానముచేసెను. ముని ధనములేని సమయమున వచ్చి నా కొసఁగెద ననిన ధనము తెమ్మని యడిగెను. రాజ్యమునుండి భార్యతోడను, కుమారునితోడను బయలుదేఱి కాశీపురమునకుఁ జేరి భార్యనమ్మి తాను కూడ వీరబాహుఁడను మాలవాని కమ్ముడుపోయి మునిఋణము తీర్చెను. ఆ సమయమున మాలనికి దాసుఁడై యుండెను. దైవముయొక్క కరుణ లేకున్నచో నెంతటివాఁడైనను నీచసేవ చేయవలసి వచ్చును. అదియేమియు నవమానకరము గాదు.

బదనుగ మంచికూర నలపాకము చేసిన నైన, నందు నిం
పొదవెడు నుప్పు లేక రుచిపుట్టఁగ నేర్చు నటయ్య భాస్కరా. 42

టీ. భాస్కరా! చదువు - విద్య, ఎంత కల్గినన్ - ఎంత నేర్చినను, రసజ్ఞత - భావమును దెలిసికొను నేర్పు, ఇంచుక - కొంచెము, చాలక + ఉన్నన్ - లేనియెడల, ఆ చదువు, నిరర్థకంబు - ఉపయోగములేనిది; ఎచ్చటన్ - ఏస్థలమందును, గుణ సంయుతులు - మంచిగుణములతోఁ గూడిన వారు, ఎవ్వరున్, మెచ్చరు, మంచికూర, పదనుగన్ - రసము గల్గియుండు నట్లు, నలపాకము చేసినన్ + ఐనన్ - నలునివలె వండినను, అందున్ - ఆ కూరలో, ఉప్పులేక, రుచి పుట్టఁగన్ - రుచి కలుగఁగా, నేర్చునటయ్యా?

తా. భాస్కరా! విద్య ఎంత చదివినను, అందలి తాత్పర్యమును దెలిసికొను శక్తి లేకున్నయెడల నాచదువు నిరుపయోగము. దాని నెవ్వరును మెచ్చుకొనరు. మంచి కూరను బాగుగా నలుఁడు వండినట్లు పక్వముగా వండినప్పటికిని దానిలో ఉప్పు లేకున్నచో రుచి కలుగునా? (కలుగదు)

ఉ. చాలఁ బవిత్రవంశమున సంజనితుం డగునేని యెట్టి దు
శ్శీలునినైనఁ దత్కుల విశేషముచే నొక పుణ్యుఁ డెంతయుం
దాలిమి నుద్ధరించును; సుధానిధిఁ బుట్టఁగఁగాదె శంభుఁ డా
హాలహలానలంబు గళమందు ధరింపుట పూని భా. 43

టీ. భాస్కరా! చాల - మిక్కిలి, పవిత్రవంశమునన్ - స్వచ్ఛమైయున కులమునందు, సంజనితుండు - పుట్టినవాఁడు, అగునేని - అయినయెడల, ఎట్టి దుశ్శీలునినైనన్ - ఎంత చెడ్డ స్వభావముగలవానినైనను, తత్కుల విశేషముచేన్ - వాని గొప్పకులముయొక్క గౌరవమును బట్టి, ఒక పుణ్యుఁడు - ఒకానొక పుణ్యాత్ముఁడు, ఎంతయున్, తాలిమిన్ - ఓర్పుతో, ఉద్ధరించును - పైకిఁదెచ్చును, సుధానిధిన్ - సముద్రమునందు (అమృతము గల చోట), పుట్టఁగన్ + కాదె? - పుట్టుటవలన కదా? శంభుఁడు - ఈశ్వరుఁడు, ఆ హాల హాలానలంబున్ - ఆ మహావిషము అను అగ్నిని, గళమునందున్ - కంఠము నందు, పూని - ప్రయత్నించి, ధరించుట - ఉంచుకొనుట.

తా. భాస్కరా! గొప్పవంశమునఁ బుట్టిన దుష్టునినైనను, వాని కులమర్యాదను జూచి యొకానొక పుణ్యాత్ముఁడు చేపట్టఁగలఁడు. అమృతస్థానమునఁ బుట్టిన హాలాహలమను విషమును గూడ ఈశ్వరుఁడు తన కంఠమందు ధరించినాఁడు గదా!

ఉ. చేరి బలాధికుం డెఱిఁగి చెప్పిన కార్యము చేయకుండినన్
బారము ముట్టలేఁ డొకనెపంబునఁ దాఁ జెడు నెట్టి ధన్యుఁడున్;
పోరక పాండుపుత్త్రులకు భూస్థలిభాగము పెట్టుమన్న కం
సారిని గాకుచేసి చెడఁడాయెనె కౌరవభర్త? భా. 44

టీ. భాస్కరా! చేరి - దగ్గఱకువచ్చి, బలాధికుండు - గొప్పబలము గలవాఁడు, ఎఱిఁగి - తెలిసికొని, చెప్పిన కార్యము - చెప్పినట్టి పనిని, చేయక, ఉండినన్, ఎట్టి ధన్యుఁడున్ - ఎంత శక్తిగలవాఁడైనను, పారము - గట్టును, ముట్టలేఁడు - పొందఁడు, ఒక నెపంబునన్ - ఒకానొక కారణము చేత, చెడును - నశించును, పోరక - యుద్ధముచేయక, పాండుపుత్త్రులకున్ - పాండవులకు, భూస్థలిభాగము - భూమియందలి పాలును, పెట్టుమన్న కంసారినిన్ - ఇమ్మని చెప్పిన శ్రీకృష్ణుని, గాకుచేసి - తిరస్కారముచేసి (అవమానించి), కౌరవభర్త - దుర్యోధనుఁడు, చెడఁడాయెనె? - చెడిపోలేదా? (చెడిపోయెను.)

తా. భాస్కరా! శక్తిగల గొప్పవాఁడు దగ్గఱకువచ్చి హితముచెప్పఁగా విని యావిధముగా నడువక యున్నచో నెంతమహిమ గలవాఁడయినను, తన కార్యము నెఱవేర్చుకొనలేకుండుటయే గాక చెడిపోవును. శ్రీకృష్ణుఁడు

43. శంకరుఁడు - హాలాహలము.

దేవదానవులు అమృతముకొఱకు సముద్రము మథించిరి. అమృతమున కంటె ముందు విషము పుట్టి తన విషపుమంటలచే లోకములను భస్మముచేయ మొదలుపెట్టెను. ఈ ఆపదఁ బోఁగొట్టుమని దేవతలు, రాక్షసులు శంకరుని బ్రార్థించిరి. కరుణాళుఁడగు నీశ్వరుఁడా హాలాహలమును లోకరక్షణకై మ్రింగి కంఠమున నిలుపుకొనెను. లోకములఁ గాపాడెను. అమృతము సముద్రమునఁ బుట్టుటచే విషమునకుఁగూడ నింత గొప్పదశ పట్టినది.

దగ్గఱఁజేరి యుద్ధముచేయక భాగమిమ్మని యెంత చెప్పినను వినక యవమానించుటచే దుర్యోధనుఁడు చెడిపోయెఁగదా?

ఉ. చేసిన దుష్టచేష్ట నది చెప్పక, నేర్పునఁ గప్పిపుచ్చి, తా
మూసినయంతటన్ బయలుముట్టక యుండునె యెట్లు; రాగిపైఁ

## 44. కృష్ణుఁడు - దుర్యోధనుఁడు.

చంద్రవంశపు రాజులలోఁ గురువను రాజుండెను. ఆతని వంశమున జనించినవారే ధృతరాష్ట్ర - పాండు రాజులు. ధృతరాష్ట్రుని కొడుకులు నూఱుగురు; పాండురాజు పుత్త్రులు ఐదుగురు. వీరందఱుఁ గౌరవు లనఁబడుదురు. అయినను ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులకుఁ గౌరవులనియు, పాండురాజు కుమారులకుఁ బాండవులనియుఁ బ్రసిద్ధనామములు కలిగెను. ఈ రెండు తెగలవారును బాల్యము మొదలుకొని స్పర్ధకలిగియుండిరి. దుర్యోధనుఁడు పాండవుల హింసించి తానే రాజ్యము నపహరింపవలయునని యెంతయుఁ బ్రయత్నించెను. కాని, యది కొనసాగక పోయెను. తుదకు మాయతో జూదము నాడించి ధర్మరాజాదుల నోడించి యరణ్యమునఁ బండ్రెండేండ్లు వసించునట్లును, నజ్ఞాతవాస మొకవత్సరము చేయునట్టి నియమముతోఁ బంపి తానే రాజ్యముఁ బాలించుచు వచ్చెను. పాండవులు నియమము ప్రకారము అరణ్యవాసము, అజ్ఞాతవాసము నడపిరి. తమ రాజ్యభాగము తమకు రావలయునని హస్తినాపురమునకు శ్రీకృష్ణుని రాయబారమంపిరి. శ్రీకృష్ణమూర్తి భగవంతుని యవతారము కదా! ఇట్టి మహానుభావుఁడు ధృతరాష్ట్రుని కొలువున, మునీంద్రులు రాజేంద్రులు కూడియున్న సమయమున ధర్మయుక్తముగ రాజ్యభాగంబు నిచ్చి సుఖింపుఁడని యెంతయు హితము నుపదేశించెను. తుదకు ఐదు పట్టణములనైన నిమ్మని కోరెను. అందుకు దుర్యోధనుఁడు సూదిమొన మోపినంత నేలకూడ నిచ్చుటకుఁ గాదని తిరస్కరించుటయే కాక పాండవులకు శ్రీకృష్ణమూర్తి యాధారమనియు, ఇతనిని బంధించి హింసించినఁ బాండవులు తిక్కలేనివారగుదురనియు బంధించుటకుఁ బూనుకొనెను. బలవంతుఁడు, మహిమగల శ్రీకృష్ణమూర్తి చెప్పిన హితమును విననందునఁ గౌరవులు సమూలముగా యుద్ధమున నశించిరి. పెద్దలమాట వినవలయును. వారిని హింసింపఁదలంపరాదు. అని యిందు నీతి తేలుచున్నది.

బూసిన బంగరుం జెదరిపోవఁ గడంగిన నాఁడునాఁటికిన్
దాసినరాగి గానఁబడదా, జనులెల్ల రెఱుంగ? భా. 45

టీ. భాస్కరా! చేసిన దుష్టచేష్టన్ - చేసినట్టి చెడ్డపని, అది, చెప్పక, నేర్పునన్-ఉపాయముతో, కప్పిపుచ్చి-దాఁచిపెట్టి, తాన్, మూసినయంతటన్ - బయటికి రానీయక యుంచినంతమాత్రముననే, అది, యెట్లు, బయట ముట్టక యుండదు - అందఱకుఁ దెలియకయుండఁగలదా! రాగిపైన్, పూసిన బంగరున్ - పూసినట్టి బంగారుకూడ, చెదరిపోవన్ - చెడిపోవుటకు, కడంగినన్ - ప్రారంభించినయెడల, నాఁడు నాఁటికిన్ - దినదినమునకు, డాసినరాగి - దాఁగియున్నరాగి, జనులు + ఎల్లరు - జనులందఱికి, ఎఱుంగన్ - తెలియునట్లు, కానఁబడదా? అగుపడదా? (కనఁబడును)

తా. భాస్కరా! చేసినట్టి చెడ్డపనిని తెలుపక నేర్పుతోఁ గప్పిపుచ్చి-దాఁచిపెట్టినయెడల నెట్లు తెలియకయుండును? రాగిమీఁద బంగారుపూఁతపూసిన, నది చెదరిపోవుటకు మొదలుపెట్టిన తర్వాత దినదినము క్రమక్రమముగఁబోయి రాగి బైటఁబడును గదా?

చ. తగిలి మదంబుచే నెదిరిఁ దన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగఁగొని పోరు టెల్ల నతిపామరుఁడై చెడు; టింతెగాక తా
నెగడి జయింపనేరఁ; డది నిక్కము; తప్పదు; ధాత్రిలోపలన్
దెగి యొకకొండతోఁ దగరుఢీకొని తాఁకిన నేమి భా. 46

టీ. భాస్కరా! మదంబుచే - పొగరుచే, తగిలి - తగుల్కొని, ఎదిరిన్-ఎదుటివానిని, తన్నున్ - తనను, ఎఱుంగక - తెలిసికొనలేక, దొడ్డవానితోన్ - బలవంతునితో, పగన్-శత్రుత్వమును, కొని, పోరుట - ఎదిరించుట, ఎల్లన్ - అంతయును, అతిపామరుఁడు + ఐ - తెలివిలేనివాఁడై, చెడుట - చెడిపోవుటయే, ఇంతె, కాక, తాన్, నెగడి - చెలరేఁగి, జయింపనేరఁడు - గెలువలేఁడు, అది, నిక్కము - సత్యము, తప్పదు, ధాత్రిలోపలన్ - భూమియందు, తగరు - పొట్టేలు, తెగి - సాహసముపూని, తెగించి, ఒక, కొండతోన్ - పర్వతముతో,

డీకొని - ఎదిరించి, తాఁకినన్ - కలియఁబడిన, ఏమి? - ఉపయోగ మేమి? (లాభము లేదని భావము)

తా. భాస్కరా! తనబలమును, ఎదుటివాని బలమును దెలిసికొనలేక బలవంతునితోఁ బోరాడఁబూనుకొన్నవాఁడు బుద్ధిలేక చెడిపోవును. ఎప్పుడును జయింపలేఁడు. ఇది నిజము. తప్పునది కాదు. పొట్టేలు గర్వించి కొండతోఁ దాఁకిన జయించునా? తానే చచ్చిపోవును గదా?

చ. తడవఁగరాదు దుష్టగుణుఁ దత్త్వ మెఱుంగక యెవ్వరైన నా
చెడుగుణ మిట్లు వల్వ దని చెప్పినఁ గ్రక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁ దెగఁ జూచుఁగా; నుఱుకఁ గాఁగిన తైలము నీటిబొట్టు పైఁ
బడునెడ నాక్షణం బెగసి భగ్గున మండక యున్నె భా. 47

టీ. భాస్కరా! దుష్టగుణున్ - చెడ్డగుణములు గలవానిని, తత్త్వ మెఱుంగక - స్వభావమును తెలియక, తడవఁగరాదు - జోలికిపోరాదు, ఎఱుంగక - తెలియక, ఎవ్వరైనన్, ఆచెడుగుణము, ఇట్లు, వల్వదు - పనికిరాదు, అని, చెప్పినన్, గ్రక్కునన్ - వెంటనే, కోపచిత్తుఁడై - కోపబుద్ధిగలవాఁడై, తెగన్ - సాహసించుటకు, చూచున్ + కా - యోచించును కదా? ఉఱుకన్ కాఁగిన తైలమున్ - సలసల కాఁగినట్టి నూనె, నీటిబొట్టు, పైన్ - మీఁద, పడునెడన్ - పడునప్పుడు, ఆ క్షణంబ - వెంటనే, ఎగసి - ఎగిరి, భగ్గునన్, మండకయున్నె - మండకయుండునా?

తా. భాస్కరా? చెడ్డవాని స్వభావమును దెలిసికొనక వాని చెడ్డగుణమును వలదని చెప్పుటకు యత్నింపరాదు. అట్లు చెప్పఁబోయిన కోపమును బూని తెగించి చెడ్డచేయును. సలసల కాఁగిన నూనెమీఁద నీటిబొట్టు బడఁగానే ఎగిరి భగ్గున మండక యుండఁగలదా?

చ. తనకు ఫలంబు లేదని యెందుఁ దలపోయఁడు కీర్తిఁ గోరు నా
ఘనగుణశాలి; లోకహితకార్యము మిక్కిలి భారమైన మే
లనుకొని పూను; శేషుఁడు సహస్రముఖంబుల గాలిఁ గ్రోలి తా
ననిశము మోవఁడే మఱి మహాభర మైన ధరిత్రి? భా. 48

టీ. భాస్కరా! కీర్తిన్ + కోరు - యశమును కోరునట్టి, ఆ ఘన గుణశాలి - ఆ గొప్ప గుణములు గలవాఁడు, తనకున్, ఫలము - లాభము, లేదు, అని, ఎదన్ - మనస్సునందు, తలపోయఁడు - ఎంచఁడు, మిక్కిలి, భారము - బరువు, ఐనన్, లోకహిత కార్యము - ప్రపంచమునకు మేలు కలుగునట్టి పని, మేలు - మంచిది, అనుకొని, పూనున్ - చేయఁదలంచును, సహస్రముఖంబులన్ - వేయినోళ్ళచేత, శేషుఁడు, గాలిన్, గ్రోలి - ఆహారముగా గ్రహించి, తాన్, అనిశము - ఎల్లప్పుడు, మహాభరము - మిక్కిలి బరువు, ఐన, ధరిత్రి - భూమిని, మఱి, మోవఁడే - మోయుట లేదా? (మోయుచున్నాఁడని భావము)

తా. భాస్కరా! కీర్తిని గోరునట్టి గుణవంతుఁడు తనకు ఫలము లేదని మనస్సులో నెంచుకొనఁడు. లోకమునకు మేలుచేయుటకే తలంచి పూనుకొనును. శేషుఁడు వేయినోళ్ళతో గాలిని మాత్రమే ఆహారముగాఁ దీసికొనుచు మిక్కిలి బరువయిన భూమిని మోయుచుండ లేదా?

చ. తనకు నదృష్టరేఖ విశదంబుగఁ గల్గినఁ గాని, లేనిచో
జనునకు నెయ్యెడన్ బరుల సంపదవల్ల ఫలంబు లేదుగా;
కనుగవ లెస్సఁగాఁ దెలివిగల్గినవారికిఁగాక, గ్రుడ్డికిన్
కనఁబడు నెట్లు వెన్నెలలుగాయఁగ నందొకరూపు భా. 49

48. శేషుఁడు - భూమిని మోయుట.

శేషుఁడు పాములకు రాజు. తండ్రి కశ్యపబ్రహ్మ. తల్లి కద్రువు. ఇతఁడు మిక్కిలి పరోపకారబుద్ధిగలవాఁడు. భగవద్భక్తిగలవాఁడు. భగవంతుని గూర్చి యొరుల కుపకార మెట్లు చేయవలయునా యని తపస్సు చేసెను. భగవంతుఁడు ప్రసన్నుఁడై వరముఁ గోరుమనియెను. పరోపకారము నే నెట్లు చేయఁగలనో యాపని నాకుఁ బ్రసాదింపుఁడని కోరెను. భగవంతుఁడగు శ్రీ మహావిష్ణుదేవుఁడు "లోకములను భరింపుము. ఈ పనికంటె నుపకారము వేఱొకనది లే" దనెను. చిత్తమని తదాజ్ఞంబూని భూమిని మోయుచున్నాఁడు. తనకు ఫలము లేకయున్నను నెంత భారమయిన కార్యమయినను పరోపకారమునకై బుద్ధిమంతుఁడు పూనుకొనుననుట కిది తగిన యుదాహరణము.

టీ. భాస్కరా! తనకున్, అదృష్టరేఖ - భాగ్యము, నిరవంబుగన్ - బాగుగా, కల్గినన్, కాని, లేనిచోన్ - లేనియెడల, జనునకున్, ఎయ్యెడన్ - ఏచోటనైనను, పరుల సంపదవల్లన్ - ఇతరుల యైశ్వర్యములవలన, ఫలంబు లేదుగా - ఉపయోగము లేదు గదా? కనుఁగవ - రెండుకన్నులు, తెల్లగాన్ - బాగుగా, తెలివి - ప్రకాశము, కల్గినవారికిన్, కాక, గ్రుడ్డికిన్ - చూపులేనివానికి, వెన్నెలలు, కాయఁగ - ప్రకాశింపఁగా, అంగన్ - ఆ వెన్నెలయందు, ఒక రూపు - ఒక వస్తువు, కనఁబడునెట్లు - ఎట్లు కనఁబడును? (కనఁబడదని భావము)

తా. భాస్కరా! తన కదృష్టము బాగుగా నుండవలెఁగాని యితరుల కదృష్టము, సంపద యుండిన లాభమేమి యుండును? కన్నులకు చూపు ఉండిననే వెన్నెలయందలి వస్తువులు కనఁబడునుగాని గ్రుడ్డివానికి ఎట్లు కనఁబడును? ఎంత వెన్నెల కాసినను గ్రుడ్డివాని కేమి తెలియఁగలదు? ఆ ఆనందము కన్నులున్నవానికే తెలియును.

ఉ. తాలిమితోడుతం దగవుఁ దప్పక నేర్పరి యొప్పుదప్పులం
బాలన సేయుఁగా; కట నుపాయవిహీనుఁడు సేయ నేర్చునే?
పాలను నీరు వేఱుపఱుపంగ మరాళ మెఱుంగుఁ గాని, మా
ర్జాల మెఱుంగునే తదురువాఁరసజ్ఞతఁ బూన? భా. 50

టీ. భాస్కరా! నేర్పరి - యుక్తాయుక్తములను, మంచిచెడ్డలను తెలిసినవాఁడు, తాలిమి తోడుతన్ - ఓర్పుతో, తగవు - న్యాయమును, తప్పక, ఒప్పుదప్పులన్ - మంచిచెడ్డలను, పాలనచేయుఁగాక - పాలించును గాని, ఉపాయ విహీనుఁడు - యుక్తిలేనివాఁడు, అటన్ - ఆ పనిని, చేయుటన్ - చేయుటకు, నేర్చునే? పాలను, నీరును, వేఱుపఱుపంగన్ - విడఁదీయుటకు, మరాళము - హంస, ఎఱుఁగున్ + కాని తెలియును కాని, మార్జాలము - పిల్లి, తత్ - ఆ హంసయొక్క, ఉరు - గొప్పదయిన, చారు - మనోహరము, రసజ్ఞతన్ - రసము నెఱిఁగెడు భావమును, పూనన్ - తెలిసికొనుటకు, ఎఱుంగునే? - నేర్చునా?

తా. భాస్కరా! మంచిచెడ్డలను దెలిసిన నేర్పరి న్యాయమును దప్పక మంచిచెడ్డలను నిర్ణయింపఁగలఁడు కాని, యేమియుఁ దెలియనివాఁ డెట్లు నెఱ వేర్పఁగలఁడు? పాలను నీటిని విడఁదీయుటకు హంసకే శక్తిగలదుగాని, పిల్లికి సాధ్యమగునా? (కాదని భావము)

ఉ. తాలిమితోడఁ గూరిమిఁ గృతఘ్నున కెయ్యెడ నుత్తమోత్త
ముల్-మే లొనరించినన్ గుణము మిక్కిలి కీడగుఁ; బాముపిల్ల
కున్-బాలిడి పెంచినన్ విషము పాయఁగనేర్చునె? దానికోఱలం
జాలఁగ నంతకంత కొకచాయను హెచ్చునుగాక భాస్కరా!

టీ. భాస్కరా! తాలిమితోడన్ - ఓర్పుతో, కృతఘ్నునకున్ - చేసిన మేలు మఱచినవానికి, ఎయ్యెడన్ - ఎక్కడనైనను, ఉత్తమోత్తముల్ - గొప్పబుద్ధి గలవారు, కూరిమి - ప్రేమచేత, మేలు + ఒనరించినన్ - మేలు చేసినయెడల, మిక్కిలి, కీడు, అగున్, పాముపిల్లకున్, పాలు + ఇడి - పాలు పోసి, పెంచినన్ - పెంచినప్పటికి, విషము, పాయఁగన్ - వదలఁగ, నేర్చునె? దానికోఱలన్, చాలఁగన్ - ఎక్కువగా, అంతకంతకున్ - క్రమ క్రమముగా, ఒకచాయను - ఒకకళతో, హెచ్చున్, కాక.

తా. భాస్కరా! మంచివారు మిగుల నేర్పుతోఁ జేసిన మేలు మఱచు వానికి మేలుచేసినను వాఁడు కీడుచేయఁబూనునుగాని, మంచి గుణము వానికి ఏమాత్రమును రాదు. పాముపిల్లకుఁ బాలుపోసి పెంచిన దానికి విషముతగ్గదు గాని, కోఱలయం దొక్కొక్క వన్నె విషము హెచ్చుచుండ లేదా?

చ. తెలియని కార్య మెల్లఁ గడతేర్చుట కొక్క వివేకిఁ జేకొనన్
వలయు, నదైన దిద్దుకొనవచ్చుఁ; బ్రయోజనమాంద్య మేమి
యుం-గలుగదు; ఫాలమందుఁ దిలకం బిడునప్పుడు చేత నద్ద
మున్, గలిగినఁ జక్కజేసికొనుఁగాదె నరుం డదిచూచి భా.

టీ. భాస్కరా! తెలియని, కార్యము + ఎల్లన్ - పని అంతయును, కడతేర్చుటకున్ - నెఱవేర్చుటకు, వివేకిన్ - ఒక తెలివిగలవానిని, చేకొనన్

వలయుఁన్ - తీసికొనవలయును, అటు + ఐనన్ - అట్లయినయెడల, దిద్దుకొనవచ్చున్ - సరిచేసికొనవచ్చును, ప్రయోజనమాంద్యము - కార్యమునకు ఆలస్యము, కలుగదు, ఫాలమందున్ - నొసటియందు, తిలకంబు - బొట్టు, ఇడునప్పుడు - ఉంచుకొనునప్పుడు, చేతన్ - చేతియందు, అద్దమున్ కలిగినన్ - అద్దము ఉండినయెడల, నరుండు - మనుష్యుఁడు, అని చూచి - దానిని జూచి, చక్కన్ + చేసికొనున్ + కాదె - బాగుగా దిద్దుకొనఁగలఁడు కదా !

తా. భాస్కరా! తెలియని పనులు నెఱవేర్చుకొనుటకు ఒక బుద్ధిమంతుని సాయమును గైకొనవలయును. అప్పుడు కార్యములు ఆలస్యము లేక నెఱవేర్చుకొనవచ్చును. బొట్టుఁ బెట్టుకొనునపుడు చేత నద్దము ఉండినయెడల మనుష్యుఁడు బాగుగ దిద్దుకొనును గదా ?

చ. దక్షుఁడు లేనియింటికిఁ బదార్థము వేఱొకచోట నుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁ, గల్ల గాదు; ప్ర
త్యక్షము; వాగులున్ వఱదలన్నియు వచ్చిన నీరు నిల్చునే,
యక్షయ మైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా !

టీ. భాస్కరా! దక్షుఁడు - శక్తిగలవాఁడు, లేనియింటికిన్, పదార్థము - వస్తువు, వేఱొక చోటనుండి, వేలక్షలు - అనేకము, వచ్చుచుండినన్, పలాయనమై - పరుగెత్తి, చనున్ - పోవును (నిలువదు), కల్లకాగు - అబద్ధము కాదు, ప్రత్యక్షము - స్పష్టము; వాగులు - వంకలును, వఱదలు - ప్రవాహములు, అన్నియున్, వచ్చినన్, అక్షయము - అపరిమితమయినది (నిలుపరాని), గండి - రంధ్రము, తెగినట్టి, తటాకములోనన్ - చెఱువునందు, నీరు నిల్చునే - నీళ్లు ఉండునా ?

తా. భాస్కరా! గృహములందుఁ దగిన యజమానుఁడు లేకయున్న నెంత దివ్యమయిన పదార్థము, ఎంతవచ్చుచుండినను, నశించునేగాని నిలువదు; ఇది నిజము; వాగులు, ప్రవాహములు ఎన్నివచ్చిచేరినను గట్లు తెగిపోయిన చెఱువులో నీరు నిలువఁగాఁగలదా ? (నిలువదు)

ఉ. దానపరోపకారగుణ♦ధన్యత చిత్తములోన నెప్పుడున్
లేని వివేకశూన్యునకు♦లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ నొక్కసరి♦పోలును; జీకున కర్ధరాత్రియం
దైన నదేమి? పట్టపగ♦లైన నదేమియు లేదు భాస్కరా!

టీ. దాన - దానమిచ్చుట, పరోపకార - ఇతరులకు మేలుచేయుట అను, గుణధన్యత - గుణములచేత గొప్పతనము, ఎప్పుడున్, చిత్తములోనన్ - మనస్సునందు, లేని, వివేకశూన్యునకున్ - తెలివిలేనివానికి, లేములు - దారిద్ర్యములు, వచ్చినవేళన్, సంపదల్ - ఐశ్వర్యములు, పూనినవేళన్ - వచ్చిన సమయమునందును, ఒక్కసరి - ఒకేవిధముగ, పోలును - ఉండును, చీకునకున్ - గ్రుడ్డివానికి, అర్ధరాత్రియందున్, ఐనన్, పట్టపగలు, ఐనన్, అది, ఏమియున్ + లేదు - ఏ భేదమును లేదు. ఒకేవిధముగ నుండును.

తా. భాస్కరా! సత్పాత్రదానము, పరోపకారము, సద్గుణము, మంచి మనస్సు లేనివానికి సంపద కలిగినను, బీదతనము వచ్చినను భేదము కనబడదు. ఒకేవిధముగ నుండును. గ్రుడ్డివానికి బగలైనను, అర్ధరాత్రియందైనను ఒకటే గాని మఱొక విధముగ నుండదు. వాడు చీకటియనిగాని, వెలుగని కాని తలంపడు గదా?

ఉ. దానము సేయఁగోరిన వ♦దాన్యున కీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమున♦కై యొక దిక్కునఁదెచ్చియైన నీఁ
బూనును; మేఘుఁడంబుధికిఁ♦బోయి జలంబులఁదెచ్చియీయఁడే
వాన సమస్తజీవులకు♦వాంఛిత మింపెసలార భాస్కరా! 55

టీ. భాస్కరా! దానము, చేయన్, కోరిన - ఇష్టపడిన, వదాన్యునకున్ - దానబుద్ధిగల దాతకు, ఈయఁగన్ - ఇచ్చుటకు, శక్తిలేనిచో నైనన్ - చేతఁగాకున్నయెడల, పరోపకారమునకై, ఒక దిక్కునన్ - ఒకానొకచోట, తెచ్చి ఐనన్, ఈన్ - ఇచ్చుటకు, పూనును - యత్నించును; మేఘుఁడు - మేఘము, అంబుధికిన్ - సముద్రమునకు, పోయి, జలంబులన్ - నీటిని,

తెచ్చి, సమస్తజీవులకున్ - ప్రాణికోట్ల కన్నిటికిని, వాంఛ - కోరిక, ఇంపెసలారన్ - నిండునట్లుగా, వాన, ఈయఁడే? - ఈయఁడా? (వర్షమును గురిపించునని భావము)

తా. భాస్కరా! ఒకరి కియ్యఁదలఁచిన దానబుద్ధిగలవాఁడు తన దగ్గఱ లేకున్నను, మఱొకచోటనైనఁ దెచ్చియిచ్చి కోరికలు తీర్పఁగలఁడు. మేఘుఁడు తనదగ్గఱ నీరు లేకున్నను, సముద్రమునకుఁబోయి నీటినిదెచ్చి లోకమునఁ గల ప్రాణికోటులకు సంతోషము గలుగునట్లు వర్షము నిచ్చుచున్నాఁడు గదా?

ఉ. దానముచేయనేరని యధార్మికు సంపద యుండి యుండియున్
దానె పలాయనం బగుట తథ్యము; బూరుగుమ్రాను గాచినన్
దానిఫలంబు లూరక వృథా పడిపోవవె యెండి గాలిచేఁ
గానలలోన, నేమిటికిఁగాక యభోజ్యము లౌట భాస్కరా!

టీ. భాస్కరా! దానము - ధర్మమును, చేయన్ + నేరని - చేయఁజాలనట్టి, అధార్మికు సంపద - ధర్మబుద్ధిలేనివాని యైశ్వర్యము, ఉండి యుండియున్ - ఉండినట్లుండియు, తానె - తనంతకే, పలాయనంబు + అగుట - నాశనము అగుట (పరుగెత్తుట), తథ్యము - నిజము, బూరుగుమ్రాను - బూరుగుచెట్టు, కాచినన్ - పండినప్పటికిని, దాని ఫలంబులు, ఊరక, వృథా - వ్యర్థముగా, పడిపోవవే, గాలిచే, ఎండి, కానలలోనన్ - అడవులలో, ఏమిటికిఁగాక - ఎందుకు పనికిరాక, అభోజ్యములు - భుజించుటకుఁ బనికిరానివి, ఔట - అగుట.

తా. భాస్కరా! దానమియ్యలేని లోభివాని సంపద యున్నప్పటికిని తనంతకుఁ దానే నాశనమయిపోవుట సత్యము. అడవులలో బూరుగుచెట్టు బాగుగాఁ బండినప్పటికిని, ఎండి, గాలిచే భుజించుటకుఁ బనికిరాని వయి దాని పండ్లు వ్యర్థముగా రాలి పడిపోవుచుండలేదా?

చ. నడవక చిక్కి లేమి యగునాఁడు నిజోదరపోషణార్థమై
యడిగిభుజించుటల్ నరుల కారయ వ్యంగ్యముకాదు; పాండవుల్

గడుబలశాలు లేవురు న♦ఖండవిభూతిఁ దొలంగి, భైక్ష్యముల్
గుడువరె? యేకచక్రపురిఁ♦గుంతియుఁదారొకచోటభాస్కరా!

టీ. భాస్కరా! నడవక - జరుగక, చిక్కి - నిలిచిపోయి, లేమి - బీదతనము, అగునాఁడు - అయిన దినమునందు, నిజ + ఉదరపోషణ + అర్థమై - తన కడుపు నించుకొనుటకై, అడిగి, భుజించుటల్ - తినుట, నరులకున్ - మనుష్యులకు, అరయన్ - చూడఁగా, వ్యంగ్యముకాదు - నిందింపఁ దగినదికాదు; పాండవులు, కడుబలశాలులు, ఏవురున్ - ఐదుగురుకూడ, అఖండ విభూతిన్ - నాశనము కాని సంపదను, తొలంగి - విడిచి, భైక్ష్యముల్ - బిచ్చములు, ఏకచక్రపురిన్ - ఏకచక్రపురమునందు, కుంతియున్, తారు - తాము, ఒకచోటన్, కుడువరె - భుజింపలేదా!

తా. భాస్కరా! తనకు జరుగక నిలిచిపోయి బీదతనము వచ్చినయెడల

57. పాండవులు - భిక్షాటనము.

దుర్యోధనుని దురాలోచనచే ధృతరాష్ట్రుఁడు పాండవులను వారణావతమునకుఁ బంపెను. వారు శ్రీవిశ్వనాథున కుపచారములుచేయుచు నందుండిరి. పాండవులు నివసించుట కొక లక్కయిల్లు దుర్యోధనుఁడు నిర్మింపఁజేసి యందుఁ గాఁపురముండునట్లు చేసెను. కొన్నాళ్ళయిన పిమ్మట నా యింటిని గాల్చుటకై గూఢచారులను గొందఱను నియమించి పంపెను. వారు తగిన కాలముకొఱకు నిరీక్షించి యుండిరి. ఈవిషయము రహస్యముగాఁ బాండవులకు విదురుఁడు తెలియఁజేసెను. ఖనకుఁ డనువానిచే సురంగము నా యింటి నుండి పట్టణము బైటికిఁ ద్రవ్వింపఁ జేసెను. పాండవు లీ విషయమును దెలిసికొని యాయింట గూఢచారులు పరుండియున్న సమయమును దెలిసికొనిరి. భీముఁ డాయింటికి నిప్పుపెట్టి సోదరులతోను, దల్లితోను సురంగమార్గమున నడవిఁజేరెను. భీముఁడు నిద్రించుచున్న సోదరులను, దల్లిని నిద్ర లేపెను. వా రాశ్చర్యపడిరి. భీముని సాహసమునకు మెచ్చుకొనిరి. అంత కొంతకాలము పాండవులుఁ, గుంతియు నితరులకుఁ దెలియకుండుటకై బ్రాహ్మణ వేషములతో నందందుఁ దిరుగుచుఁ దుదకు ఏకచక్ర పురమున భిక్ష మెత్తుకొనుచుఁ గాలమును బుచ్చిరి. తమకు శక్తి తగ్గినపు డాత్మపోషణమునకు భిక్షమెత్తుకొనుటలో లోపము లేదు.

నడుగుకొని జీవించుటలో ఏమియు లోపములేదు. పాండవులు బలశాలులయినను, ఐదుగురు, తమ సంపదనుండి తొలఁగినవారయి, తల్లితోఁగూడ ఏకచక్రపురమున నుండి బిచ్చమెత్తుకొని పొట్టఁబోసికొనలేదా?

చ. నుడువుల నేర్పుచాలని మ◆నుష్యుఁ డెఱుంగక తప్పనాడినం
గడుఁ గృపతోఁ జెలంగుదురు◆కాని, యదల్పరు తజ్ఞులెల్లఁ; ద
ప్పడుగులు వెట్టుచున్నడుచు◆నప్పుడు బాలునిముద్దుసేయఁగాఁ
దొడఁగుదు, రింతెకాని పడఁ◆ద్రోయుదురే యెవరైన? భా. 58

టీ. భాస్కరా! నుడువులన్ - మాటలాడుటయందు, నేర్పు - చమత్కారము, చాలని, మనుష్యుఁడు, ఎఱుంగక - తెలిసికొనలేక, తప్పనాడినన్ - విరుద్ధముగా మాటలాడినప్పటికిని, తజ్ఞుల్ + ఎల్లన్ - ఆ విషయమును తెలిసిన బుద్ధిమంతు లందఱును, కడుఁకృపతోన్ - మిక్కిలి దయతో, చెలంగుదురు - ఉందురు, కాని, అదల్పరు - బెదిరింపరు; ఎవరైనన్ - ఎట్టివారైనను, తప్పు + అడుగులు + పెట్టుచున్ + ఉన్న + అపుడు - తప్పటడుగులు పెట్టుచు నడచుచున్నప్పుడు, బాలునిన్ - పిల్లవానిని, ముద్దుసేయఁగాన్ - ప్రేమించుటకు, తొడఁగుదురు - ప్రారంభింతురు, ఇంతెకాని, పడఁద్రోయుదురే - క్రిందఁ బడవేయుదురా?

తా. భాస్కరా! మాటల చమత్కారము చాలనివాఁడు తెలియక విరుద్ధముగా మాటలాడినయెడల బుద్ధిమంతులగువారు వాని విషయమును దెలిసికొని దయతో మన్నింతురేగాని నిందింపరు. బాలుఁడు చేతఁగాక తప్పటడుగులు పెట్టుచుండిన యెడల నెవరైనను ముద్దుచేయుదురుగాని పడఁద్రోయుదురా? (త్రోయరని భావము)

ఉ. నేరిచి బుద్ధిమంతుఁ డతి◆నీతివివేకము దెల్పినం, జెడం
గారణ మున్నవాని కది◆గైకొనఁ గూడదు; నిక్కమే; దురా
చారుఁడు రావణాసురుఁ డ◆సహ్యము నొందఁడె? చేటుకాలముం
జేరువ యైననాఁడు నిర◆సించి విభీషణుబుద్ధి, భా. 59

టీ. భాస్కరా! బుద్ధిమంతుఁడు, నేరిచి - తెలిసికొని, అతి నీతి వివేకము - ఎక్కువ న్యాయమగు పద్ధతిని, తెల్పినన్ - చెప్పినచో, అది - ఆ మంచిత్రోవ, చెడన్ - చెడుటకు, కారణము + ఉన్నవానికిన్ - సిద్ధపడిన వానికి, కైకొనన్ - తీసికొనుటకు, కూడదు - ఇష్టపడదు; నిక్కమే - నిజము; దురాచారుఁడు - చెడ్డనడవడిగలవాఁ డగు, రావణాసురుఁడు, చేటుకాలము - చెడిపోవు సమయము, చేరువ ఐననాఁడు - దగ్గఱ సమీపించినపుడు, విభీషణు బుద్ధి - విభీషణునియొక్క మంచిమాటను, నిరసించి - త్రోసివేసి, అసహ్యమున్ - ఓర్వలేని కులనాశనమును, ఒందఁడె - పొందలేదా? (పొందెను)

తా. భాస్కరా! తెలివిగలవాఁడు చక్కఁగాఁ దెలిసికొని న్యాయమార్గమును బాగుగాఁ జెప్పినను, చెడుటకు సిద్ధముగా నుండినవాఁడు ఆ పద్ధతిని గ్రహించి నడువఁడు. ఎట్లనఁగా చేటుకాలము సమీపించినందువలన రావణాసురుఁడు విభీషణుఁడుచెప్పిన మంచి మార్గమును వినక కులనాశనమును పొందినాఁడు గదా?

చ. నాగిలినవేళ నెంతటి ఘనుండును దన్నొక రొక్క నేర్పుతో
నగపడి ప్రోదిసేయక తనంతట బల్మికిరాఁడు; నిక్కమే;
జగమున నగ్నియైనఁగడు సన్నగిలం బడియున్న నింధనం
బెగయఁగఁద్రోచి యూదక మఱెట్లు రవుల్కొన నేర్చు, భా.

టీ. భాస్కరా! నాగిలినవేళన్ - నొప్పిపొందిన సమయమునందు, ఎంతటి ఘనుండును - ఎట్టి గొప్పవాఁడుకూడ, తన్ను, ఒకరు, ఒక్క నేర్పుతోన్ - ఒక మంచి యుపాయముతో, అగపడి - కనఁబడి, చూచి, ప్రోదిసేయక - పోషింపకయున్నచో, తనంతటన్ - తనంతకుతానే, బల్మికిన్ + రాఁడు - బలమునకు రాఁడు (గొప్పకు రాఁడు), నిక్కము + ఏ - నిజమే, జగమునన్ - లోకమునందు, అగ్నియైనన్ - నిప్పు ఐనను, కడున్ - మిక్కిలి, సన్నగిలంబడియున్నన్ - నశించి కొంచెముగా నుండినప్పుడు, ఇంధనంబున్ -

కట్టెను, ఎగయఁగన్ ద్రోచి - పైకిద్రోసి, ఊదక, మఱి, ఎట్లు, రవుల్కొనన్ నేర్చున్ - మండ నేర్చును.

తా. భాస్కరా! ఎంతటి గొప్పవాఁడయినను ఆపదపొంది తగ్గిన సమయమున ఎవఁడైన నొకఁడు తగిన యుపాయముతోఁజూచి తోడుపడిననేగాని వాఁడు మరల గొప్పతనమునకు రాఁడు. నిజముగదా? అగ్నియును, సన్నగిలినపుడు, కట్టెలు ఎగఁద్రోసి యూదిననే గదా మెల్లఁగ రగుల్కొని తన ధర్మమును బొంది యుండుచున్నది?

ఉ. పండితులైనవారు దిగు♦వం దగ నుండఁగ నల్పుఁడొక్కఁడు
ద్దండతఁ బీఠమెక్కిన బు♦ధప్రకరంబుల కేమి యెగ్గగున్?
గొండొకకోఁతి చెట్టుకొన♦కొమ్మల నుండఁగఁ గ్రింద గండభే
రుండమదేభసింహనికు♦రుంబము లుండవె చేరి భా. 61

టీ. భాస్కరా! పండితులు - విద్వాంసులు, ఐనవారు, దిగువన్ - క్రిందిభాగమునందు, తగన్, ఉండఁగన్, అల్పుఁడు - నీచుఁడు, ఒక్కఁడు, ఉద్దండతన్ - గర్వముతో, పీఠము - ఆసనమును (ఎత్తయిన స్థానమును), ఎక్కినన్ - కూర్చుండినయెడల, బుధప్రకరంబులకున్ - పండితుల సముదాయమునకు, ఎగ్గు - లోపము, ఏమి, అగున్, కొండొక కోఁతి - ఒకానొక కోఁతి, చెట్టు కొనకొమ్మలన్, ఉండఁగన్, క్రిందన్ - ఆ చెట్టుక్రింద, గండభేరుండ, మదేభ - మదపుటేనుఁగులును, సింహ నికురుంబములు - సింగముల సమూహములును, చేరి, ఉండవె - ఉండుటలేదా? (ఉండును)

తా. భాస్కరా! విద్వాంసులు క్రింద నుండఁగా నల్పుఁడగువాఁడు గర్వముతో నెత్తయిన పీఠమునఁ గూర్చుండినయెడలఁ బండితుల కే లోపము గలుగఁజాలదు. అల్పమయిన కోఁతి చెట్టు కొన కొమ్మమీఁద నుండును. క్రింద నేనుఁగులు, సింహములు, గండభేరుండములును ఉండును. వాని గొప్పతనమున కేమయిన లోపముగల్గెనా?

ఉ. పట్టుగ నిక్కుచున్ మదము♦బట్టి మహాత్ములఁ దూలనాడినం
బట్టినకార్యముల్ చెడును;♦ప్రాణము పోవు; నిరర్థదోషముల్

పుట్టు; మహేశుఁ గాదని కుబుద్ధి నొనర్చిన యజ్ఞతంత్రముల్
ముట్టకపోయి, దక్షునికి మోసము వచ్చెఁ గదయ్య భా. 62

టీ. భాస్కరా! పట్టుగన్ - పట్టుదలతో, నిక్కుచున్ - గర్వించుచు, మదము + పట్టి - పొగరుపట్టి, మహాత్ములన్ - గొప్పవారిని, తూలనాడినన్ - నిందించినయెడల, పట్టిన కార్యముల్ - ప్రారంభించిన పనులు, చెడును, ప్రాణము పోవున్, నిరర్థదోషముల్ - ఉపయోగములేని లోపములు, పుట్టున్ - కలుగును; దక్షుఁడు - దక్షుఁడనువాఁడు, మహేశున్ - ఈశ్వరుని, కాదు + అని - తిరస్కరించి, కుబుద్ధిన్ - చెడ్డబుద్ధితో, ఒనర్చిన - చేసినట్టి, యజ్ఞ తంత్రముల్ - యజ్ఞ కార్యములు, ముట్టకపోయి - పూర్తిగాకపోయి, మోసము వచ్చెన్ కద - చేటుకలిగెను గదా? అయ్యా.

తా. భాస్కరా! చలముతో గర్వించి పెద్దవారిని నిందించినచోఁ బ్రయత్నించిన కార్యములు పూర్తి కాకపోవుటయే కాక ప్రాణహానియుఁ గలుగును. వ్యర్థమయిన దోషముకూడ వచ్చును. దక్షుఁడు ఈశ్వరునిఁ దూలనాడి తాను గర్వించి చేసిన యజ్ఞము పూర్తియయ్యెనా? తుదకు నాశనముకూడఁ గలిగెఁ గదా?

---

62. దక్షుఁడు - శివుఁడు.

దక్షుఁడు - ఇతఁడు నవ బ్రహ్మలలో నొక్కఁడు. ఇతని కుమార్తెయే దాక్షాయణి, ఈశ్వరుని భార్య. ఈశ్వరునకు దక్షుఁడు మామ. ఒకనాఁ డితఁడు బ్రహ్మసభకుఁ బోఁగా నందఱును లేచి మర్యాద చేసిరి. ఈశ్వరుఁడు మాత్రము లేవలేదు. ఆ కార్యము తన్నవమానపఱచినట్లు దక్షుఁడు తలంచి శివునకు హవిర్భాగము లేకుండునట్లు యజ్ఞము నొకదానిని గావింపఁ దలఁచెను. దేవతల నాహ్వానించెను. మహావైభవముతో దేవతలు దక్షయజ్ఞమున కరుగుచుండిరి. దాక్షాయణి శంకరుఁడు వల దన్నను తండ్రిచేయు యజ్ఞమునకు వెళ్ళెను. అక్కడఁ దండ్రిచే నవమానమును బొందెను. దక్షుఁడు శివుని విపరీతముగ నిందించెను. శంకరునకుఁ గోపమువచ్చెను. వీరభద్రునిఁ బంపెను. యజ్ఞమును పాడుచేసి దక్షుని తలఁ గోసివేసెను. పెద్దలను గర్వముతో నిందించువారి గతి యింతే.

చ. పరహిత మైన కార్య మతిభారముతోడిదియైనఁ బూను స
త్పురుషుఁడు లోకముల్ పొగడఁ బూర్వమునం దొకతాలవర్షమున్
గురియఁగఁ జొచ్చినన్ గదిసి గొబ్బున గోజనరక్షణార్థమై
గిరి నొకకేల నెత్తెనట కృష్ణుఁడు ఛత్రముభాతి? భా. 63

టీ. భాస్కరా! పరహితము - ఇతరులకు ఇష్టము (మేలు) అయిన, కార్యము - పని, అతిభారముతోడిది - ఎక్కువ శ్రమతోఁ గూడినది, ఐనన్ - అయినప్పటికి, సత్పురుషుఁడు - మంచివాఁడు, లోకముల్, పొగడన్ - నుతింపఁగా, పూనున్ - చేయుటకు సిద్ధముగ నుండును; పూర్వమునందు, ఒక, తాలవర్షమున్ - ఱాళ్ళవాన, కురియఁగన్, చొచ్చినన్ - ప్రారంభింపఁగా, కృష్ణుఁడు, కదిసి - చేరి, గొబ్బునన్ - వెంటనే, గోజన రక్షణార్థము + ఐ - ఆవులను, జనులను కాపాడుటకొఱకు, అట - అక్కడ, ఛత్రముభాతిన్ - గొడుగువలె, గిరిన్ - కొండను, ఒక కేలన్ - ఒక చేతితో, ఎత్తెన్ - పైకి ఎత్తి పట్టుకొనెను.

తా. భాస్కరా! సజ్జనుఁడు ఇతరులకు మేలుచేయునట్టి కార్యము ఎంత బాధ కలిగించునది యైనను, లెక్కపెట్టక లోకములు తన్నుఁ బొగడునట్లుగ చేయుటకుఁ బూనును. శ్రీ కృష్ణుఁడు గోవులను, జనులను రక్షించుటకై కొండను ఒకచేతితో నెత్తి గొడుగువలె వెంటనే పట్టుకొని ఱాళ్ళవానవలని బాధను తొలఁగించెను గదా?

---

63. శ్రీ కృష్ణమూర్తి - గోవర్ధన పర్వతము.

శ్రీ కృష్ణమూర్తి వసుదేవునకు దేవకీదేవికిఁ దనయుఁడుగా నవతరించిన భగవంతుఁడు. వసుదేవుఁడు కంసునివలని భయమున గోకులమున నందుని భార్యయగు యశోదప్రక్కన శ్రీకృష్ణునిఁ బరుండఁబెట్టి యామెకుఁ బుట్టిన శిశువును దైవనియోగమునఁ దెచ్చెను. కంసుఁడు బాలికను హింసింప నాకాశమున కెగురవేయ నది మాయమయ్యెను. శ్రీకృష్ణుఁడు గోకులమున సురక్షితముగఁ బెరుఁగుచుండెను. శ్రీకృష్ణమూర్తి బాల్యక్రీడలలో ననేక రాక్షసులను గంసునిచేఁ బంపఁబడినవారిని సంహరించెను. ప్రతివత్సరము యాదవులు

చ. పలుచనిహీనమానవుఁడు పాటిఁదలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁగాని, మతి భాసురుఁడైన గుణప్రపూర్ణుఁ డ
ప్పలుకులఁబల్కఁబోవఁడు; ని బద్ధిగ; నెట్లన? వెత్తికుండ దాఁ
దొలఁకుచునుండుఁగాని, మఱి తొల్కునె నిండుఘటంబు భా.

టీ. భాస్కరా! పలుచని హీనమానవుఁడు - బలములేని నీచుఁడు, పాటి - మర్యాదను, తలంపక, నిష్ఠురఉక్తులన్ - కఠినములయిన మాటలను, పలుకుచున్, ఉండున్, కాని, మతిభాసురుఁడు - తెలివిచేఁ బ్రకాశించునట్టి వాఁడు, ఐన, గుణప్రపూర్ణుఁడు - మంచిగుణములచే నిండినవాఁడు, అప్పలుకులన్ - ఆమాటలను, పల్కన్ + పోవఁడు - పలుకఁడు, నిబద్ధిగన్ - నిజముగ, ఎట్లు, అనన్, వెత్తికుండ - నిండుగలేని పాత్ర, తాన్ - అది, తొలఁకుచున్ - కదలి క్రిందఁబోవుచు, ఉండున్, కాని, నిండుఘటంబు - నిండుకుండ, మఱి, తొల్కునె? - కదలి పొర్లిపోవునా?

తా. భాస్కరా! గుణములేని నీచుఁడు తాను బలములేక యున్నను నెచ్చుతక్కువలు తెలిసికొనఁజాలక కఠినపుమాటలను మాటలాడుచునే యుండును. తెలివిగలవాఁడు అట్టిమాటల నెపుడును బలుకఁడు. ఇది నిజము. వెలితిగల కుండ తొలఁకునుగాని నిండుకుండ యెప్పుడైనను తొలఁకునా? తొనఁకదని భావము.

---

చేయు నింద్రయాగమును మాన్పించి శ్రీ కృష్ణమూర్తి గోవులకుఁ బూజలు సల్పునట్లు చేసెను. ఇంద్రునకుఁ గోపము వచ్చెను. గోకులముపై రాళ్ళవాన గురియించి బాధింపసాగెను. గోపాలకు లందఱు శ్రీ కృష్ణమూర్తినిఁ బ్రార్థించిరి. వెంటనే భక్తరక్షకుండగు శ్రీకృష్ణుఁడు గోవర్ధన పర్వతమును గొడుగువలె నెత్తి పట్టుకొని, దాని క్రిందకు గోవులను, గోపాలకులను జేర్చెను. వారందఱును నే బాధలేక సుఖపడిరి. ఇంద్రుఁడు భంగపడి శ్రీ కృష్ణమూర్తి కడకు వచ్చి ప్రార్థించెను. ఇతరులకు హితకరమయిన కార్య మదెంత భారమయినను జేయుటకు గొప్ప బుద్ధిగలవారు సిద్ధపడి చేయుదురు.

చ. పలుమఱు సజ్జనుండుప్రియ♦భాషలెపల్కుఁ గఠోరవాక్యముల్
బలుకఁ డొకానొకప్పు డవి♦పల్కినఁ గీడును గాదు; నిక్కమే;
చలువకు వచ్చి మేఘుఁడొక♦జాడను దా వడగండ్ల రాల్చినన్
శిలలగునోటు; వేగిరమె♦శీతలనీరముగాక భాస్కరా! 65

టీ. భాస్కరా! సజ్జనుఁడు - మంచివాఁడు, పలుమఱు - అనేక పర్యాయములు, ప్రియభాషలె - మంచిమాటలనే, పల్కున్, కఠోరవాక్యముల్ - కఠినములయిన మాటలను, పలుకఁడు, ఒకానొకప్పుడు, అవి - ఆ కఠినపు మాటలను, పల్కినన్, కీడును - హానికూడ, కాదు, నిక్కమే - నిజమే, మేఘుఁడు - మేఘము, చలువకున్ - చల్లదనమునకు, వచ్చి - పొంది, ఒకజాడను - ఒకవిధముగా, వడగండ్లన్, రాల్చినన్ - కురిసినప్పటికిని, శిలలగునోటు - అవి రాళ్ళు కావు గదా? వేగమె - త్వరగా, శీతలనీరముగాక - చల్లని నీళ్ళే యగుఁ గదా?

తా. భాస్కరా! మంచివాఁడు మాటిమాటికి మంచిమాటలనే మాటలాడును గాని కఠినముగా మాటలాడఁడు. ఒకవేళఁ గఠినముగా మాటలాడినను, అవియే కీడును జేయఁజాలవు. ఇది నిజము. మేఘుఁ డొకానొక సమయమున వడగండ్లు కురిసినను అవి రాళ్లుగావు. చల్లని నీరే యగును గదా?

ఉ. పాపపుఁద్రోవవాని కొక♦పట్టున మేను వికాస మొందినన్
లోపల దుర్గుణంబె ప్రబ♦లుంగద? నమ్మఁగఁగూడ దాతనిన్;
బాపటకాయకున్ నునుపు♦పైపయి గల్గినఁగల్గుఁగాక! యే
రూపున దానిలోఁగల వి♦రుద్ధపుఁజేఁదు నశించు భాస్కరా! 66

టీ. భాస్కరా! పాపపుఁ ద్రోవవానికిన్ - చెడుమార్గము గలవానికి, ఒక పట్టునన్ - ఒకానొక సమయమందు, మేను - దేహము, వికాసము - ప్రకాశము, ఒందినన్ - పొందినప్పటికిని, లోపలన్ - మనసునందు, దుర్గుణంబె - చెడ్డగుణమె, ప్రబలుంగద - ఎక్కువయగునుగదా, ఆతనిన్ - అట్టివానిని, నమ్మఁగూడదు, పాపటకాయకున్ - చేఁదుపుచ్చకాయకు, పైపయి -

పైన, నునుపు - నున్నగా, కల్గినన్ - ఉండిన, కల్గన్ + కాక - ఉండును గాక, ఏ రూపునన్ - ఏ విధముగా, దానిలోన్ కల - ఆ పుచ్చకాయలో ఉన్న, విరుద్ధపుఁజేఁదు - పనికిరాని చేఁదుగుణము, నశించున్ - పోవును? - పోఁ గలదు? (పోదు)

తా. భాస్కరా! పాపాత్ముఁడగువాని కొకానొక కాలమునందు దేహము మాత్రము ప్రకాశించుచుండినప్పటికి వానిలోపల దుర్గుణముమాత్రము తగ్గదుం అట్టివానిని నమ్మఁగూడదు. పుచ్చకాయ పైకి మినమినలాడుచు నునుపుగా నుండినను, లోపలనుండు విరుద్ధమైన చేఁదు నశింపఁగలదా?

ఉ. పూనిన భాగ్యరేఖ చెడి♦పోయినపిమ్మట నెట్టిమానవుం
డై నను వానినెవ్వరుఁ బ్రి♦యంబునఁ బల్కరు; పిల్వ రెచ్చటం;
దా నిది యెట్లొకో? యనినఁ♦దథ్యము; పుష్పము వాడి వాసనా
హీనతనొందియున్నయెడ♦నెవ్వరు ముట్టుదురయ్య! భా. 67

టీ. భాస్కరా! పూనిన - పొందిన, భాగ్యరేఖ - అదృష్టము, చెడి పోయిన పిమ్మట - నశించినతర్వాత, ఎట్టిమానవుండైనను - ఎంత మంచి గుణము గలిగియుండినవాఁడైనను, వానిని, ఎవ్వరున్, ప్రియంబుగన్ - ఇష్టముతో, పల్కరు - పల్కరింపరు, ఎచ్చటన్, పిల్వరు, తాను, ఇది, ఎట్లొకో - ఏ విధముగానో, అనినన్, తథ్యము - నిజము, పుష్పము - పూవు, వాడి - ఎండి, వాసనాహీనతన్ - వాసనలేకుండుటను, ఒంది - పొంది, ఉన్నయెడన్ - ఉన్నప్పుడు, ఎవ్వరు, ముట్టుదురు - తాఁకుదురు? అయ్యా!

తా. భాస్కరా! తనకుండిన యదృష్టము నశించిన తర్వాత ఎట్టి మంచి గుణము గలిగినను, నెవరును పిల్వరు; ప్రేమతో మాటలాడరు. ఎట్లనఁగా, పువ్వు వాడిపోయి వాసనలేక యుండఁగా నెవరైనను తాఁకుదురా? త్రోసి వేయుదురు.

ఉ. పూరితసద్గుణంబు గల♦పుణ్యున కించుక రూపసంపదల్
దూరములైన, వానియెడ♦దొడ్డగఁజూతురు బుద్ధిమంతు; లె

ట్లారయఁ గొగ్గులైనమఱి♦యందుల మాధురి చూచికాదె, ఖ
ర్జూరఫలంబులం బ్రియము♦చొప్పడ లోకులు గొంట భా. 68

టీ. భాస్కరా! పూరిత సద్గుణంబుగల - సంపూర్ణమయిన మంచి గుణము గలిగిన, పుణ్యునకున్ - పుణ్యాత్మునకు, ఇంచుక - కొంచెము, రూపసంపదల్ - ఆకారము ఐశ్వర్యము, దూరములు + ఐనన్ - తొలఁగి పోఁగా, బుద్ధిమంతులు, వానియెడన్ - వానియందు, దొడ్డగన్ - గొప్పగా, చూతురు - కనుఁగొందురు, ఎట్లు - ఎట్లనఁగా, ఆరయన్ - ఆలోచింపఁగా, గొగ్గులు - ఎండి వాడిపోయినవి, ఐనన్, మఱి, అందులమాధురి - అందుఁగల తీపును, చూచి కాదె, ఖర్జూరఫలంబులన్ - ఖర్జూరపుఁబండ్లను, ప్రియము చొప్పడన్ - మిక్కిలి యిష్టముతో, లోకులు - జనులు, కొంట - తీసికొనుట.

తా. భాస్కరా! మంచిగుణములు నిండుగాఁ గలవానికిఁ గొంచెము రూపము, సంపద తగ్గిపోయినను, బుద్ధిమంతులు గొప్పగానే చూచి మర్యాద చేయుదురు; ఇది నిజము. ఎట్లనఁగా, ఖర్జూరపుఁ బండ్లు ఎండిపోయి గొగ్గులైనప్పటికిని, వానియందుఁగల తియ్యఁదనమును జూచియే కదా జనులు మిగుల ప్రియముతోఁ గొనుచుండుట.

ఉ. ప్రల్లదనంబుచే నెఱుక♦పాటొకయింతయు లేక యెచ్చటన్
బల్లిదుఁడైన సత్ప్రభు న♦బద్ధము లాడినఁ ద్రుంగి పోదు; రె
ట్లల్లసభాస్థలిం గుమతు♦లై శిశుపాలుఁడు దంతవక్త్రుఁడుం
గల్లలు గృష్ణునిం బలికి ♦ కాదె హతంబగు టెల్ల భా. 69

టీ. ప్రల్లదనంబుచే - వదరుఁబోతు స్వభావముతో, ఎఱుకపాటు - తెలివి, ఒక యింతయున్ లేక - ఏ కొంచెమయినను లేక, ఎచ్చటన్ - ఎక్కడనైనను, బల్లిదుఁడైన - బలవంతుఁడగు, సత్ప్రభున్ - శ్రేష్ఠమయిన రాజును గూర్చి, అబద్ధములు - అసత్యములు, ఆడినన్ - పలికినయెడల, త్రుంగిపోదురు - నశింతురు, ఎట్లు - ఎట్లన, అల్ల - ఆ ప్రసిద్ధమయిన, సభా

సభన్ - కొలువుకూటమునందు, కుమతులై - చెడ్డబుద్ధిగలవారై, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడున్, కల్లలు - అబద్ధములు, కృష్ణునిన్, పలికికాదె - పలికికదా, హతంబగుటెల్ల - నాశనము అగుట.

తా. భాస్కరా! తాము నశించుట తెలిసికొనలేక వదఱుఁబోతులై పెద్దలను గూర్చి యెచ్చటఁ జూచినను నబద్ధము లాడి నిందించిన నశింతురు. ధర్మరాజు కొలువుకూటమునందు దుష్టబుద్ధులై శ్రీకృష్ణునింగూర్చి కల్లలాడి యధిక ప్రసంగము చేయుటచే శిశుపాల దంతవక్త్రులు నాశన మయిరి.

ఉ. ప్రేమను గూర్చి యల్పునకుఁబెద్దతనంబును, దొడ్డవానికిం
దా మతితుచ్ఛపుంబని, నెఱదం బరికింపక యీయరాదుగా;
వామకరంబుతోడఁ గుడువం గుడిచేత నపానమార్గముం
దోమఁగ వచ్చునే మిగులఁదోఁచని చేఁతలుగాక భా. 70

టీ. భాస్కరా! ప్రేమనుగూర్చి - ప్రియము ననుసరించి, అల్పునకున్ - నీచునకు, పెద్దతనంబును - మర్యాద యగు పనిని, దొడ్డవానికిన్ - గొప్ప

69. శిశుపాల దంతవక్త్రులు.

శ్రీకృష్ణునకు వీరు మేన త్తకొడుకులు. వీరు సోదరులు. వైకుంఠమున ద్వారపాలకులుగా నుండిన జయ విజయు లనువారు. పూర్వము సనకసనంద నాదులచే శాపమును బొంది భూలోకమున మూఁడు జన్మములనెత్తి విష్ణుమూర్తిపై నెడతెగని పగతోఁ బోరాడి ముక్తి పొందునట్లు అనుగ్రహింపఁబడిరి. మొదటి జన్మమున హిరణ్యాక్షహిరణ్యకశిపులయిరి. రెండవ జన్మమున రావణ కుంభకర్ణులైరి. మూఁడవ జన్మమున శిశుపాల దంతవక్త్రులుగాఁబుట్టిరి. కాఁబట్టి పుట్టినది మొదలుకొని, కృష్ణుని ద్వేషించుచు సాధించుచుండిరి. ధర్మరాజు రాజసూయయాగము చేయునపుడు శిశుపాలుఁడు సకలరాజుల సమక్షమున, మహామునులయెదుట శ్రీకృష్ణుని ననరాని యబద్ధములగు నిందల నిందించెను. దాన నపుడే చక్రముచే హతుఁడయ్యెను. తర్వాతఁ బిలువని పేరంటముగ వాడు తెచ్చుకొని దంతవక్త్రుఁడే హతుఁడయ్యెను. శ్రీకృష్ణుని నెగ్గులాడుటవలని ఫలము ననుభవించిరి. కాఁబట్టి పెద్దలను దూషింపరాదు.

వానికి, తాము - అతితుచ్ఛపుంబనిఁ - మిక్కిలి నీచమయిన పనిని, ఎదఁ - మనస్సునందు, పరికింపక - చూడక, ఈయరాదుగా - ఈయకూడదు కదా? వామకరంబులోఁడఁ - ఎడమచేతితో, కుడువఁ - భుజించుటకును, కుడిచేతఁ - కుడిచేతితో, అపానమార్గముఁ - గుదస్థానమును, తోమఁగఁ వచ్చునే - కడుగు కొనఁగా నగునా? మిగులఁ - మిక్కిలి, తోఁచని - పనికిరాని, చేఁతలుగాక - చేష్టలు గదా? (పనులుగదా?)

తా. భాస్కరా! ప్రేమతో నీచునకు గొప్పపనిని, గొప్పవానికి మిక్కిలి నీచమయిన పనిని, ఆలోచనచేయక నియమింపరాదు. ఎడమచేతితో నన్నముఁ దినుటయును, కుడిచేతితో గుదము కడుగుకొనుటయుఁ జేయవచ్చునా? ఎవనిని ఎట్టి మర్యాదతోఁ జూడవలయునో ఎఱుఁగవలయునని భావము.

చ. ఫలమతిసూక్ష్మమైనను నృపాలుఁడుమంచిగుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకు లాతని కపేక్షయొనర్తు; రదెట్లు? చంద్రికా
విలసనమైనఁ, దా మనుభవింపఁ జకోరము లాసఁ జేరవే
చలువగలట్టివాఁ డగుటఁ జందురు నెంతయుఁ గోరి భా. 71

టీ. భాస్కరా! నృపాలుఁడు - రాజు, మంచి గుణాఢ్యుఁడైనచో - మంచి గుణములు గలవాఁడయినయెడల, ఫలము - లాభము (సుఖము), అతి సూక్ష్మము - మిక్కిలి కొంచెము, అయినను, ఎలమిఁ - సంతోషముతో, వివేకులు - బుద్ధిమంతులు, ఆతనికిఁ - ఆరాజుకొఱకు, అపేక్ష - కోరిక, ఒనర్తురు - చేయుదురు, అది + ఎట్లు?, చంద్రికా విలసనము + ఐనఁ - వెన్నెల మాత్రమే ప్రకాశించుటయైనను, చకోరములు - వెన్నెల పిట్టలు, తాము అనుభవింపఁ - అవి సుఖించుటకు, ఆసఁ - ఆశతో, చలువగలట్టివాఁడు అగుటఁ - చల్లదనముగలవాఁ డగుటవలన, చందురుఁ - చంద్రుని, ఎంతయుఁ - మిక్కిలి, కోరి - ఇష్టపడి, చేరవే - దగ్గఱఁజేరుటలేదా?

తా. భాస్కరా! రాజు మంచి వాఁడయిన యెడల నాతనివలన లాభము కొంచెముగా నుండినను, బుద్ధిమంతులు సంతోషముతో మిక్కిలి కోర్కెగలిగి

చేరుదురు. ఎట్లనఁగాఁ, జంద్రుఁడు వెన్నెలను మాత్రమే యిచ్చుచున్నను, చల్లఁదనముగలవాఁ డగుటచేత మిక్కిలి యాశతోఁ జకోరములు దగ్గఱఁజేరుచున్నవి కదా ?

ఉ. బంధుర సద్గుణాఢ్యుఁ డొక♦పట్టున లంపట నొందియైన, దు
స్సంధి దలంపఁ; డన్యులకుఁ♦జాలహితంబొనరించుఁగాక; శ్రీ
గంధపుఁజెక్క రాగిలుచుఁ♦గాదె, శరీరుల కుత్సవార్థమై
గంధములాత్మఁబుట్టఁదఱు♦గంబడి యుండుటలెల్ల భా. 72

టీ. భాస్కరా! బంధుర సద్గుణాఢ్యుఁడు - అధికములైన మంచి గుణములుగలవాఁడు, ఒక పట్టునన్ - ఒకానొక కాలమున, లంపటన్ - బాధను, ఒందియైనన్ - అనుభవించి యయినను, దుస్సంధిన్ - చెడ్డను, తలంపఁడు - కోరఁడు, అన్యులకున్ - ఇతరులకు, చాలహితంబున్ - ఎక్కువ మేలును, ఒనరించున్ - చేయును, కాక-కదా? శ్రీగంధపుఁజెక్క, రాగిలుచున్ - సంతోషమునిచ్చుచు, శరీరులకున్ - ప్రాణులకు (దేహధారులకు), ఉత్సవార్థమై - సంతోషము కొఱకు (వేడుకకై), గంధములు - సువాసనలు, ఆత్మన్ - తన యందు, పుట్టన్ - కలుగునట్లుగా, తఱుగంబడి యుండుటలు ఎల్లన్ - నాశనము (అఱిగిపోవుట) అగుచు కరుగుట యంతయును.

తా. భాస్కరా! నిలుకడగల మంచి గుణములు గలవాఁడు తానెక్కడనైన బాధపడినప్పటికిని నితరుల చెడ్డను కోరఁడు; మేలే చేయఁదలంచును. శ్రీగంధపుఁజెక్క జనములకు సంతోషమును గలిగించుటకై తాను తఱిగిపోవుచున్నను సువాసనల నిచ్చుచున్నది కదా ?

చ. బలము తొలంగుకాలమునఁ♦బ్రాభవసంపద లెంతధన్యుఁడున్
నిలుపుకొనంగ నోపఁ; డది♦నిశ్చయ; మర్జునుఁ డీశ్వరాదులం
గెలిచినవాఁడు, బోయలకుఁ♦గీడ్పడి, చూచుచుఁగృష్ణభార్యలం
బలువుర నీయఁడే, నిలువఁ♦బట సమర్థుఁడు గాక భా. 73

టీ. భాస్కరా! బలము - దైవశక్తి, తొలంగు - నశించు, కాలమునన్, ప్రాభవసంపదలు - గొప్పవగు ఐశ్వర్యములు, ఎంత ధన్యుఁడున్ - ఎంతటి గొప్పవాఁడయినను, నిలుపుకొనంగన్ - అపుటకు, ఓపఁడు - శక్తిగలవాఁడు కాఁడు, అది, నిశ్చయము - సత్యము, అర్జునుఁడు, ఈశ్వరాదులన్ - శంకరుఁడు మొదలగువానిని, గెలిచినవాఁడు, బోయలకున్ - బోయవారికి, కీవ్వడి - ఓడి పోయి, చూచుచున్, కృష్ణభార్యలన్ - శ్రీకృష్ణుని భార్యలను, పలువురన్ - అనేక స్త్రీలను, నిలువఁబెట్టన్ - నిలుపుటకు సమర్థుఁడు గాక - బలముగలవాఁడు కాక, ఈయఁడే - అర్పింపలేదా ? (ఇచ్చెనని భావము)

తా. భాస్కరా ! తనకు దైవబలము తగ్గిపోవునట్టి కాలము వచ్చినపుడు ఎంతవాఁడైనను, తన సామర్థ్యమును నిలుపుకొనలేఁడు. ఇది నిజము. పూర్వము బోయవారికి లోఁబడిపోయి యర్జునుఁడు, శ్రీకృష్ణుని భార్యలను చూచుచు వదలిపెట్టి శక్తిలేక వచ్చినవాఁడు గదా ?

చ. బలయుతుఁ డైనవేళ నిజ•బంధుఁడు తోడ్పడుఁగాని, యాతఁడే
బలము తొలంగెనేని తన•పాలిట శత్రు; వదెట్లు? పూర్ణుడైఁ

7౮. అర్జునుఁడు - బోయలు.

అర్జునుఁడు గాండీవమును ధరించి కౌరవయుద్ధమునఁ జూపిన సాహసము, పరాక్రమము ప్రసిద్ధి కెక్కినవి. ఎందఱు రాక్షసులనో జయించెను. దిగ్విజయము గావించెను. అశ్వమేధ యాగమున నశ్వరక్షకుఁడై ప్రతాపమును జూపెను. ఇట్టి పరాక్రమశాలి యగు నర్జునుఁడు శ్రీకృష్ణుఁడు ఈ లోకమును వదలి వెళ్ళిన తర్వాత ద్వారకాపురమునుండి శ్రీకృష్ణ భార్యలను వెంటఁ దీసి కొని హస్తినాపురమునకుఁ బోవుచుండెను. పూర్వము విరోధులుగా నుండిన బోయలు వచ్చి యర్జునునిఁ జుట్టుకొని శ్రీకృష్ణకాంతలను, ద్వారకాపుర స్త్రీలను బాధింపసాగిరి. అర్జునుఁడు గాండీవమునే యెక్కుపెట్టఁజాలక బలము నశించి యూరక చూచుచుండెను. కిరాతులు ఆ స్త్రీలను గొనిపోయిరి. ఆ యర్జునుని బల మేమయ్యెను ? కాఁబట్టి దైవబలము లేనికాలమున నెంతటివాఁడును దన మహిమ నిలుపుకొనలేఁడు.

జ్వలనుఁడుకానఁగాల్చుతఱి♦సఖ్యముఁజూపునువాయుదేవుఁ; డా
బలియుఁడు సూక్ష్మదీప మగు♦పట్టున నార్పఁడె గాలి భా. 74

టీ. భాస్కరా! బలయుతుఁడు - బలముతోఁ గూడినవాఁడు, ఐన వేళన్ - అయినట్టి సమయమునందు, నిజబంధుఁడు - తన చుట్టము, తోడ్పడున్ - సాయము చేయును, కాని, ఆతఁడే - ఆ చుట్టమే, బలము, తొలంగెనేని - పోయినయెడల, తమ పాలిట శత్రువు - తనకు పగవాఁడగును, అదెట్లు- అది ఎటులనఁగా, పూర్ణుఁడై - ఎక్కువగా నున్నవాఁడై, జ్వలనుఁడు - అగ్ని, కానన్ - అడవిని, కాల్చుతఱి - కాల్చునట్టి సమయమునందు, వాయుదేవుఁడు- గాలి, సఖ్యము - స్నేహము, చూపును, ఆ బలియుఁడు - ఆ బలవంతుఁడగు అగ్ని, సూక్ష్మదీపము - సన్నని దీపము. అగుపట్టునన్ - అయిన సమయమునందు, గాలి, ఆర్పఁడె - ఆర్పి వేయఁడా? (ఆర్పునని భావము)

తా. భాస్కరా! బలవంతుఁడుగానున్న సమయమందు బంధువు సాయపడునేకాని బలము తగ్గినపుడు సాయపడకుండుటయేగాక పగవాఁడు కూడ నగును. ఎట్లనఁగా, అగ్ని సంపూర్ణముగఁ జెలరేగి యడవిని గాల్చుచున్న సమయాన గాలి చెలికాఁడై ఎక్కువ తోడుపడును. అయగ్నియే తక్కువయై సన్నదీపముగా నుండినపుడు చెలికాఁడగు గాలియే ఆర్పివేయును గదా?

ఉ. జల్లిదుఁడైన సత్ప్రభువు♦పాయక యుండినఁగాని, రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు♦సేరినఁ దేజము గల్గ దెయ్యెడన్;
జల్లనిచందురుం డెడసి♦సన్నపుఁ జుక్కలు కోటి యున్న రం
జిల్లునె వెన్నెలల్? జగము♦చీఁకటు లన్నియుఁ బాయ భా.75

టీ. భాస్కరా! జల్లిదుఁడు - బలవంతుఁడు, ఐన, సత్ప్రభువు - గొప్ప మంచిరాజు, పాయక-వదలక, ఉండినన్-ఉండిననే, కాని, రచ్చలోన్ - సభయందు, చిల్లరవారు - తక్కువవారు, నూఱుగురు - అనేకులు, చేరినన్ - ఉండినను, ఎయ్యెడన్ - ఏ స్థలమునన్ఐనను, తేజము - ప్రకాశము, కల్గదు, చల్లని చందురుండు - చల్లదనముతోనుండు చంద్రుఁడు, ఎడసి - తొలఁగి,

సన్నపుఁజుక్కలు - చిన్నచిన్న నక్షత్రములు, కోటియున్నన్ - అనేకము లుండినను, జగము చీఁకటులు - లోకమునందలి చీఁకట్లు, అన్నియున్ - సకలము, పాయన్ - తొలఁగునట్లు, వెన్నెలల్ - వెలుఁగులు, రంజిలునె? - ప్రకాశించునే? (ప్రకాశింపవు)

తా. భాస్కరా! బలవంతుఁడై శక్తిగలిగిన మంచిరాజు ఉండినయెడల సభ బాగుగ వన్నెకెక్కునుగాని చిల్లరమనుష్యులు ఎందఱుండినను నేమియు నుపయోగములేదు; ఆ సభ కొంచెమయినఁ బ్రకాశమునకు రాఁజాలదు. ఎట్లనఁగా, చంద్రుఁడు లేక చిన్నచిన్న నక్షత్రము లెన్నియుండినను, లోకమునందలి చీఁకటులు పోఁగొట్టునట్టి వెన్నెలకాంతు లుండఁగలవా!

ఉ. భుజబలశౌర్యవంతులగు • పుత్త్రులఁ గాంచినవారి కెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు•నిక్కము చేకుఱుఁ; గుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁ డర్జునుఁడు•వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి, తల్లివ్రత•కార్యము దీర్పఁడె తొల్లి భా. 76

76. అర్జునుఁడు-కుంతి-ఐరావతవ్రతము.

వ్రతములలో గజగౌరీవ్రత మనునది యొకటి. గాంధారి సకల వాంఛలను సమకూర్చునని నారదుఁడు బోధింపఁగా విని చేయుటకుఁ బ్రారంభించెను. దేవతాగజమగు ఐరావతమును నోముకుఁ దీసికొని రాఁజాలక దానికిఁ బ్రతినిధిగా, మట్టితో నేనుఁగును జేయింపవలయునని కుమారులతో మన్ను తెప్పించుచుండెను. ఈ విషయము కుంతీదేవికిఁ దెలిసెను. ఆమెయు నీ వ్రతమును చేయవలయునని యెంచెను. తన కొడుకు లైదుగురే అంతమట్టిని దేఁగలరా యని యాలోచించుచుండెను. అర్జునుఁ డావిషయమును దెలిసికొని తల్లితో, "అమ్మా! దేవతాధిపతియగు నింద్రుని యేనుఁగునే తెప్పింతు"నని తన బలము నెల్లదిక్కులఁ బ్రకాశింపఁజేసి యైరావతమును దెప్పించి ప్రత్యక్షముగ నైరావతవ్రతమును జరిపించి కీర్తిని గాంచెను. పరాక్రమవంతులగు కొడుకులు గలవారికే కొదువయుఁ గలుగదు.

టీ. భాస్కరా! భుజబల శౌర్యవంతులు - భుజములయొక్క బలము, పరాక్రమము గలవారు, అగు పుత్త్రులన్-అయిన కొడుకులను, కాంచినవారికిన్- కనినవారికి, ఎయ్యెడన్ - ఎచ్చటనైనను, నిజహృదయేప్సితార్థములు - తమ మనస్సునందుండు కోరికలు, చేకుఱున్ - నెఱవేఱును, నిక్కము - నిజము! కుంతిదేవికిన్, విజయబల + అర్జునుఁడు - జయించునట్టి బలముచేఁ గూడిన వాఁడు, అర్జునుఁడు, వీరపరాక్రమము - శూరులయొక్క ప్రతాపమును, ఒప్పన్- ఉండఁగా, దేవతాగజమును - ఐరావతమును, తెచ్చి, తొల్లి - పూర్వము, తల్లి వ్రతకార్యము - తల్లియొక్క నోమును, తీర్పఁడె - నెఱవేర్పలేదా? (నెఱ వేర్చెను.)

తా. భాస్కరా! భుజబలము, పరాక్రమము గల పుత్త్రులను గనిన తల్లికి మనస్సునందుఁగల కోరికలు తప్పక నెఱవేఱును. ఇది నిజము. పూర్వము కుంతీదేవికి పరాక్రమశాలియగు అర్జునుఁడు పుట్టి ఆమెకోరిన కోర్కె ననుసరించి నోముకొఱకై దేవతాగజమగు ఐరావతమును దెచ్చి యిచ్చి నోము పూర్తి గావించెను గదా?

ఉ. భూనుతులైన దేవతలు♦పూర్వము కొందఱు వావివర్తనల్
మాని చరింపరో యనుచు♦మానవు ల్లట్లు చరింపఁ బోల; దం
భోనిధులన్నియుం దనదు♦పుక్కిటఁబట్టె నగస్త్యుఁడంచు, నా
పూనిక కెవ్వఁడోపు;నది ♦ పూర్వమహత్త్వముసుమ్ము భా.77

టీ. భాస్కరా! పూర్వము, భూనుతులైన - భూలోకజనులచే పొగడఁ బడుచున్న, ఐన, దేవతలు, కొందఱు, వావివర్తనల్ - బంధుత్వము యొక్క పద్ధతిని, మాని - వదలి, చరింపరో - తిరుగరా, అనుచున్, మానవులు, అట్లు - ఆ దేవతల విధముగా, చరింపన్ పోలదు - నడచుకొనరాదు, అగస్త్యుఁడు, అంభోనిధులు - సముద్రములు, అన్నియున్ - అన్నిటిని, తనదుపుక్కిటన్ - తన నోటియందు, పట్టెన్ - పట్టుకొనెను, అంచున్ - అనుచు, ఆపూనికకు - ఆగ

ష్ట్యునివలె, ఎవ్వఁడు, ఓపుꣳ - శక్తుఁడగు, అది - ఆ గొప్పతనము, పూర్వ మహత్త్వము సుమ్మీ - పూర్వము చేసిన గొప్ప ప్రభావమే సుమా.

తా. భాస్కరా : దేవతలు కొందఱు పూర్వకాలమున చుట్టఱికము వరు సలను లెక్కింపక వివాహము మొదలయిన కార్యములను జేయుచు నడుచు కొనిరని, ఆ విధముగ మనుష్యులు నడచుకొనరాదు. అగస్త్యమహర్షి సము ద్రములందలి జలమునంతయు పుక్కిటితోఁ బట్టుకొనెను గదా ? ఈ కార్యము నేమానవుఁ డయినఁ జేయఁగలఁడా ? ఆ మహిమ అద్భుతమయినది.

ఉ. భూపతి కాత్మబుద్ధి మదిఁ♦బుటనిచోటఁ బ్రధాను లెంత ప్ర
జ్ఞాపరిపూర్ణు లైనఁ గొన ♦ సాగదు కార్యము; కార్యదక్షులై
యోపిన ద్రోణభీష్మకృప ♦ యోధు లనేకులు గూడి, కౌరవ
క్ష్మాపతికార్య మేమయినఁ ♦ జాలిరె చేయఁగ వారు ? భా.78

టీ. భాస్కరా! భూపతికిꣳ - రాజునకు, ఆత్మబుద్ధి - తన తెలివి, మదిꣳ - తన మనసునందు, పుట్టనిచోటꣳ - కలుగని స్థలమున, ప్రధానులు - మంత్రులు, ఎంత ప్రజ్ఞాపరిపూర్ణులు - గొప్ప తెలివిచే సంపూర్ణ మయినవారు, ఐనꣳ, కార్యము, కొనసాగదు - నెఱవేఱదు; కార్యదక్షులు + ఐ - అన్ని

77. అగస్త్యుఁడు-సముద్ర జలము.

కాలకేయు లను రాక్షసులు లోకములో బాధించుచుండిరి. దేవతలు కూడఁ గాలకేయుల నేమియుఁ జేయలేక యుండిరి. వారు దేవతల మీఁదికి వచ్చి సముద్రమున దాఁగికొనుచుందురు. వీరి బాధ పడుట మిగులఁ గష్టమయ్యెను. దేవతలును, మునులును వచ్చి యగస్త్యునిఁ బ్రార్థించిరి. సముద్రజలమును శోషింపఁజేయుమని కోరిరి. అగస్త్యుఁడు లోకోపకారార్థమై సముద్ర జలము నంతయుఁ బానముచేసెను. కాలకేయులు బైటఁబడిరి. అంత దేవతలు వీరిని సంహరించిరి. తర్వాత సముద్రమును నింపు మనిరిగాని జలమునంతను జీర్ణించుకొంటిననియు, సాధ్యము కాదనియు తెల్పెను. దేవతలు చేసినట్లు మనము చేయఁగలమా ?

కార్యములయందును నేర్పుగలవారలై, ఓపిన - శక్తిగలిగిన, ద్రోణ-ద్రోణుఁడు, భీష్మ - భీష్ముఁడు, కృప - కృపుఁడు, యోధులు - (మొదలగు) వీరులు, అనేకులు - పెక్కుమంది, కూడి - చేరి, కౌరవక్ష్మాపతికార్యము - దుర్యోధనుని పనిని, వారు - ఆ వీరులు, చేయఁగన్ + చాలిరె - నెఱవేర్పఁగలిగిరా? (నెఱవేర్పలేదు.)

తా. భాస్కరా! రాజునకుఁ దన మనస్సునందు ఇష్టము, శక్తి కలుగనియెడల మంత్రులు మొదలయినవారు ఎంత ప్రజ్ఞావంతులు, బలముగలవారు ఉన్నను కార్యము నెఱవేఱదు. దుర్యోధనుని కార్యమును భీష్మద్రోణకృపాదులెంద ఉండినను నెఱవేర్పఁ గలిగినారా?

ఉ. భూరిబలాఢ్యుఁ డైనఁ దల♦పోయక విక్రమశక్తిచే నహం
కారమునొందుటల్ తగవు♦గా దతఁ డొక్కఁడ మోసపోవుఁగా;
వీరవరేణ్యుఁ డర్జునుఁడు ♦ వింటికి నే నధికుండ నంచుఁ, దా
నూరక వింటి నెక్కిడఁగ♦నోపఁడు కృష్ణుఁడు లేమి భా. 79

టీ. భాస్కరా! భూరిబలాఢ్యుఁడు - గొప్పబలముతోఁ గూడినవాఁడు, ఐనన్, తలపోయక - ఆలోచనచేయక, విక్రమశక్తిచేన్ - పరాక్రమము

78. దుర్యోధనుని కార్యము-భీష్మాదుల తోడ్పాటు.

దుర్యోధనుఁడు దుర్వర్తనముతోఁ బాండవులను జెఱుపఁదలంచుచు యుద్ధము పడునొకండు అక్షౌహిణులనుగూర్చి భీష్ముఁడు మొదలగువారు తోడ్పాటుగలరని యత్నించెను. కాని బుద్ధిలేని యీప్రయత్నము దుస్సాధ్యమని యెఱుఁగఁడయ్యెను. భీష్మాదులు మిక్కిలి తోడ్పడిరి. కాని యుద్ధమున నపజయము, తుదకు దుర్యోధనుఁడు కూలుట యేర్పడెను. బుద్ధిగలిగి చేసిన పని నెఱవేఱునుగాని తోడ్పాటే ప్రధానము కాదు.

79. కృష్ణుఁడు లేని యప్పుడు అర్జునుని పరాక్రమము 73 పద్యములోఁ గలదు.

యొక్క - సామర్థ్యముచేత, అహంకారముగా - గర్వమును, ఒందుటగా - పొందుట, తగవు - న్యాయము, కాదు, అతఁడు - ఆ బలవంతుఁడుకూడ, ఒక్కెడఁగ - ఒక సమయమున, మోసపోవుఁగా, కా - కాదా? వీరవరే ణ్యుఁడు - పరాక్రమవంతులలో శ్రేష్ఠుఁడయిన, అర్జునుఁడు, వింటికిగా - ధనుస్సునకు, ఏగా - నేను, అధికుండగా - గొప్పవాఁడను, అంచుగా - అనుచు, తాను - ఆ అర్జునుఁడు, ఊరక - కారణము లేకయే, కృష్ణుఁడు లేమిగా - శ్రీకృష్ణుఁడు లేని సమయమున, వింటిగా - విల్లును, ఎక్కిడఁగగా - ఎక్కుపెట్టుటకు, ఓపఁడు - శక్తిగలవాఁడు కాఁడు.

తా. భాస్కరా! ఎంత బలవంతుఁడైనను తన పరాక్రమమునకై యహంకారమును బూనరాదు. అట్టివాఁడుకూడ ఒక్కొక్క సమయమందు మోసపోవును. అర్జునుఁడు వీరులలో మొదటివాఁడయ్యును, శ్రీ కృష్ణుఁడు లేని సమయాన (నిర్యాణానంతరము) ధనుస్సునే యెక్కుపెట్టలేనివాఁడయ్యెను.

ఉ. భ్రష్టున కర్థవంతు లగు♦బాంధవు లెందఱు గల్గినన్ నిజా
దృష్టము లేదు గావున ద♦రిద్రతఁబాపఁగ లేరు; సత్కృపా
దృష్టిని నిల్పి లోకుల క ♦ తిస్థిరసంపద లిచ్చు లక్ష్మి యా
జ్యేష్ఠ కదేటికిం గలుగఁ♦జేయదు తోడనెపుట్టి భాస్కరా! 80

టీ. భాస్కరా! భ్రష్టునకుగా - పనికిమాలినవానికి, అర్థవంతులు - ధనవంతులు, అగు - అయిన, బాంధవులు - చుట్టములు, ఎందఱు - ఎంత మంది, కల్గినగా - ఉండినను, నిజ - తనయొక్క, అదృష్టము - భాగ్యము, లేదు, కావునగా, దరిద్రతగా - బీదతికమును, పాపఁగగా - పోఁగొట్టుటకు, లేరు - చాలరు; సత్కృపాదృష్టిని - చక్కని దయతోఁగూడిన చూపును, నిల్పి - ఉంచి, లోకులకుగా - జనులకు, అతిస్థిర - మిగుల శాశ్వతమైన, సంపదలు - భాగ్యములు, లక్ష్మి - ఇచ్చునటువంటి లక్ష్మీదేవి, ఆజ్యేష్ఠకుగా - దరిద్రదేవతకు, తోడనే పుట్టి - కూడఁబుట్టినదై, అది - ఆ సంపదలను, ఏటికిగా - ఏల, కలుగఁజేయదు - కలిగింపదు?

తా. భాస్కరా! అదృష్టము లేనివానికి బంధువు లెందఱు ధనవంతులుండినను వారిసంపద రాఁజాలదు. ఉపయోగములేనిదగుటవలన వాని దుర దృష్టమే వానికిఁగాని భాగ్యమంటఁజాలదు. లోకమునం దెల్లవారికిని సంపదల నిచ్చు లక్ష్మీదేవి తనతోఁబుట్టువగు జ్యేష్ఠాదేవతకు సంపదనియ్యఁజాలకపోయి నది గదా?

చ. మదిఁ దను నాశపడ్డయెడ • మంచిగుణోన్నతుఁ డెట్టిహీనునిన్
వదలఁడు; మేలుపట్టున న • వశ్యము మున్నుగ నాదరించుఁగా;
త్రిదశవిమానమధ్యమునఁ • దెచ్చికృపామతి సారమేయమున్
మొదల నిడండె ధర్మజుఁడు • మూఁగి సురావళి చూడ? భా. 81

టీ. భాస్కరా! మదిన్ - మనసునందు, తనున్, ఆశపడ్డయెడన్ - కోరినచో, మంచి గుణోన్నతుఁడు - శ్రేష్ఠము లయిన గుణములయందు గొప్ప వాఁడు, ఎట్టిహీనునిన్ - ఎంతటి నీచునినైనను, వదలఁడు - విడిచి పెట్టఁడు, మున్నుగన్ - ముందుగా, మేలుపట్టునన్ - తనకు సుఖము గలుగు కాలము నందు, అవశ్యము - ముఖ్యముగా (తప్పక), ఆదరించున్ + కా - గౌరవిం చును గదా! ధర్మజుఁడు - ధర్మరాజు, సురావళి - దేవతల సముదాయము, మూఁగి - చుట్టుకొని, చూడన్ - చూచుచుండఁగా, త్రిదశవిమాన మధ్యమునన్ - దేవతా విమానము నడుమను, కృపామతిన్ - దయతోఁగూడిన బుద్ధితో, సార మేయమున్ - కుక్కను, తెచ్చి, మొదలన్ - ముందుగా, ఇడండె - ఉంచఁడా? (ఉంచెనని భావము)

81. ధర్మరాజు-కుక్క.

శ్రీ కృష్ణుఁడు పరమపదమునకు వేంచేసెనని ధర్మరాజు అర్జునునివలన వినెను. అంత రాజ్యమున వైరాగ్యమును బూనెను. మహాప్రస్థానము చేయ వలయునని నిశ్చయించెను. రాజ్యమును అర్జునుని కుమారుఁడగు అభిమన్యునకుఁ బట్టాభిషేకము చేసెను. హితము నుపదేశించెను. తమ్ములును, భార్యయు వెంటరాఁగాఁ బ్రయాణమయ్యెను. హస్తినాపురమునుండి యొక కుక్క వెంట

తా. భాస్కరా! మంచి గుణములు గలవాఁడు తన దగ్గఱఁజేరిన యెట్టి గుణహీనునైనను వదలిపెట్టఁడు. తనకు మేలు గలుగు సమయమునందు ముందుగా ముఖ్యముగా గౌరవించును. ధర్మరాజు తాను స్వర్గమునకుఁ బోవునపుడు తనతో వచ్చిన కుక్కను, దేవత లాశ్చర్యమును బొందునట్లుగా, విమానము నందు ముందుగాఁ గూర్చుండఁబెట్టి గౌరవించెను గదా?

ఉ. మాటలకోర్వఁజాలఁ డభిమానసమగ్రుఁడు; ప్రాణహాని యౌ
చోటుల నైనఁ దా నెదురుచూచుచునుండుఁ; గొలంకులోపల
న్నీట మునింగినప్పు డతి నీచము లాడిన రాజరాజు పో
రాట మొనర్చి నేలఁబడఁడాయెనె భీమునిచేత? భా. 82

టీ. భాస్కరా! అభిమానసమగ్రుఁడు - అభిమానముచే నిండినవాఁడు, మాటలకున్, ఓర్వన్ + చాలఁడు - ఓర్చుకొనలేఁడు, ప్రాణహాని - ప్రాణమునకుఁ గీడు, ఔ చోటులన్ - అగునట్టి స్థలములందుఁగూడ, తాన్ - ఆయభిమానుఁడు, ఎదురు చూచుచున్, ఉండును - సిద్ధముగా నుండును; రాజరాజు - దుర్యోధనుఁడు, కొలంకులోపలన్ - మడుఁగునందు, నీటన్ - నీటిలో, మునింగి

వచ్చుచుండెను. కొంతదూరముపోఁగా ద్రౌపది మరణించెను. తర్వాత సహదేవుఁడు, పిమ్మట నకులుఁడు, ఆవల అర్జునుఁడు, అంతఁ గొంత దవ్వు చనఁగా భీముఁడు పరలోకమున కరిగిరి. ధర్మరాజు చింతఁ బొందక తనయాత్ర సాగించుచుండెను. కుక్క మాత్రము వెంటవచ్చుచునే యుండెను. ఈ కుక్క ధర్మరాజు ధర్మబుద్ధిని బరీక్షింప వచ్చిన ధర్మదేవత. కొంతదూరము పోఁగాఁ బోఁగా దేవతలు విమానముగొని ధర్మరాజుకడకువచ్చి, యెక్కి పుణ్యలోకమునకు రమ్మనికోరిరి. ధర్మబుద్ధియగు ధర్మరాజు కుక్కను విమానమెక్కించిన నేనెక్కుదు ననెను. దేవత లనుచితమని యెంత నిలిపినను నిలువక యిది పుణ్యము చేసినది, నన్ను అనుసరించివచ్చినది, ఇదియును నావెంట రావలయునని విమాన మెక్కించెను. కాఁబట్టి హీనుఁడైనను వెంట వచ్చినయెడల గౌరవింపవలయును.

నప్పుడు - దాఁగియున్న పుడు, అతినీచములు - పనికిరాని మాటలను, ఆడినన్ - పలుకఁగా, భీమునిచేతన్ - భీమునితో, పోరాటము - యుద్ధము, ఒనర్చి - చేసి, నేలఁబడఁ డాయెనె - క్రిందఁబడ లేదా ?

తా. భాస్కరా : తన గౌరవమును కాపాడుకొనఁ దలంచినవాఁడు ఇతరుల నిందలను ఓర్చుకొనలేఁడు. ప్రాణములుపోవుటకైనను ఎదురు చూచుచు సిద్ధముగ నుండును. దుర్యోధనుఁడు మడుఁగునందు మునిఁగియుండునపుడు భీముఁడు నిందించిన మాటలను సహింపలేక యెదుర్కొని భీమునిచేతఁ గ్రింద బడిపోయెను గదా ?

ఉ. మానవనాథుఁ డాత్మరిపు♦మర్మ మెఱింగినవాని నేలినం
గాని, జయింప లేఁ డరులఁ;♦గార్ముకదక్షుఁడు రామభద్రుఁ డా
దానవనాయకున్ గెలువఁ ♦ దా నెటుపోవు, దదీయనాభికా
స్థానసుధన్ విభీషణుఁడు♦తార్కొని చెప్పక యున్న భా. 83

టీ. భాస్కరా! మానవనాథుఁడు - రాజు, ఆత్మరిపుమర్మము - తన

82. భీముఁడు - దుర్యోధనుఁడు - మడుఁగు.

కౌరవులకును, పాండవులకును ఘోరసంగ్రామము జరిగెను. ఆ యుద్ధమున నందఱును హతులయిరి. దుర్యోధనుని తమ్ములు, బంధువులు, మిత్రులు, సైన్యము, సమస్తము నశించెను. దుర్యోధనుఁడు నిస్సహాయుఁడై యింకఁ దాను గెలువఁజాలనని యెంచెను. సిగ్గుపడెను. ఒక మడుఁగులో దుమికి జలస్తంభన మను విద్యచే నందు దాఁగెను. ఈ విషయమును దెలిసికొని పాండవులు మడుఁగుదగ్గఱకుఁబోయి దుర్యోధనునకు రోషమువచ్చునటులు నిష్ఠురముల నాడిరి. దుర్యోధనుఁడు అభిమానము గలవాఁడు. మర్యాద లెక్కపెట్టువాఁడు. కాఁబట్టి వెంటనే మడుగునుండి వెడలివచ్చి భీమునితో ద్వంద్వ యుద్ధముచేసి భీముని గదాదండముచేఁ దొడలు విఱుగఁ గొట్టఁబడి నేలఁ గూలెను. అభిమానము గలవాఁడు ప్రాణహానిసమయమునను సైరించును గాని మాటల నోర్చుకొనలేఁడు.

శత్రువుయొక్క - రహస్యమును, ఎఱింగినవానిని - తెలిసినవానిని, ఏలినక్ కాని - దగ్గఱఁజేర్చి పోషించిననే కాని, అరులక్ - శత్రువులను, జయింపలేఁడు- గెలువఁజాలఁడు, కార్ముకదక్షుఁడు - విలువిద్యయందు నేర్పుగలిగినట్టి, రామభద్రుఁడు - శ్రీరాముఁడు, ఆ దానవనాయకుక్ - రాక్షసరాజగు రావణాసురుని, గెలువక్ - గెలుచుటకు, తదీయనాభికోష్ఠానసుధక్ - ఆ రావణాసురునియొక్క నాభియందుండిన అమృతముయొక్క విషయమును, విభీషణుఁడు - రావణుని తమ్ముఁడు, తారొక్కని - సమీపించి, చెప్పకయున్నక్ - చెప్పకుండిన, తాన్- శ్రీరాముఁడు, ఎటులు - ఏవిధముగా, గెలువన్ - జయించుటకు, ఓపున్ - శక్తి గలవాఁడగును ?

తా. భాస్కరా ! ఏరాజయినను, తన శత్రువుయొక్క రహస్యమును దెలిసినవానిని దగ్గఱఁదీసి పోషించిననే కాని శత్రువులను జయింపఁజాలఁడు. విలువిద్యలో గట్టివాఁడయిన శ్రీరాముఁడుకూడ రాక్షసరాజయిన రావణాసురుని జయించుటకై విభీషణుని దగ్గఱఁ జేర్చుటవలన నతనిచే రావణుని నాభియందుండిన యమృతము విషయము తెలిసికొని యోడింపఁగల్గెను గదా !

---

83. రావణుఁడు - మర్మము - విభీషణుఁడు.

శ్రీరామచంద్రుఁడు తమ్మునితోను, భార్యయగు సీతతోను నరణ్యమున నుండఁగా రావణుఁడు సీతను మోసమున నపహరించెను. రామలక్ష్మణులు సీతను వెదకుచుఁబోయి వానరసైన్యముతో సముద్రము బంధించి లంకాపట్టణమును ముట్టడించిరి. రామరావణులకు భయంకర సంగరము జరిగెను. రాక్షసులు అనేకులు హతులయిరి. రాముఁడు రావణాసురుని తలలు ఎన్ని పర్యాయములు నఱికి వైచినను, నవి మరల మొలచుచునేయుండినవి. శ్రీరాముఁడు విసుఁగుజెంది యోజించుచుండెను. అపుడు విభీషణుఁడు రావణుని నాభియందమృతమున్నదనియు, నది తొలఁగినఁగాని రావణుఁడు హతుఁడు కాఁజాలఁడనియు మర్మమును వెల్లఁబుచ్చెను. అంత శ్రీరాముఁ డామృతము నింకునట్లు చేసి రావణుని తలలు తెగఁగొట్టి జయమును బొందెను. శత్రురహస్యముల నెఱింగినవానిని రాజయినవాఁడు తన దగ్గఱఁ జేర్చుట రాజనీతి. గెలుపునకు మూలముగనుండును.

ఉ. మానవుఁ డాత్మకిష్ట మగు♦మంచి ప్రయోజన మాచరించుచోఁ
గానక యల్పుఁ డొక్కఁ డది♦గాదని పల్కిన వానిపల్కుకై
మానఁగఁజూడఁ డాపని; స♦మంచితభోజనవేళ నీఁగ కా
లూనిన వంటకంబు దిన♦కుండఁగ నేర్పగు నోటు భా. 84

టీ. భాస్కరా! మానవుఁడు - మనుష్యుఁడు, ఆత్మకున్ - తనకు, ఇష్టము, అగు మంచి ప్రయోజనమున్ - అయిన మంచిపనిని, ఆచరించుచోన్ - చేయుచుండఁగా, కానక - తెలియక, ఒక్క అల్పుఁడు - ఒక్క నీచుఁడు, అది, కాదు + అని - తగదని, పల్కినన్, వానిపల్కుకై - వానిమాట కొఱకు, ఆపనిని, మానఁగన్ - చాలించుటకు, చూడఁడు - తలంపఁడు, సమంచిత భోజనవేళన్ - చక్కని భోజనము చేయు సమయమందు, ఈఁగ, కాలూనినన్ - వ్రాలినయెడల, వంటకంబు - అన్నమును, తినకుండఁగన్ - తినక మానుటకు, నేర్పగునోటు - మంచి తెలివియగునా? (కాదు)

తా. భాస్కరా! ఏ మనుష్యుఁడయినను, తన కిష్టమయిన మంచిపనిని జేయుచుండఁగాఁ దెలిసికొనలేక నీచుఁడయినవాఁ డాపనిని మంచిది కాదని పల్కినయెడల వాని మాటనుబట్టి దానిని చేయకమానునా? తప్పక చేసియే తీఱును. అన్నము తినునట్టి సమయమున ఈఁగ వ్రాలిన ఆ యన్నమును తినక వదలిపెట్టుట వివేక మెట్లగును?

ఉ. మానిని చెప్పిన ట్లెఱుక♦మాలినవాఁ డటుచేసినన్ మహా
హాని ఘటించు నేఘనుని♦కైనఁ; నసంశయ; ముర్విపైఁ గృపా
హీనతఁ బల్కినన్ దశర♦థేశ్వరుఁ డంగనమాటకై గుణాం
భోనిధి రాముఁ బాసి చని ♦ పోవఁడె శోకముతోడ భా. 85

టీ. భాస్కరా! మానిని - ఆఁడుది, చెప్పినట్లు, ఎఱుకమాలినవాఁడు - తెలివిలేనివాఁడు, అటుచేసినన్ - ఆ విధముగాఁజేసిన, మహాహాని - గొప్పకీడు, ఏఘనునికైనన్ - ఎంత గొప్పవానికయినను, ఘటించున్ - కలుగును;

అసంశయము - సందేహములేదు, ఉర్విపైన్ - భూమియందు, కృపాహీనతన్ - దయలేనిదయి, పల్కన్ - మాటలాడఁగా, దశరథేశ్వరుఁడు - దశరథరాజు, అంగనమాటకై - స్త్రీయొక్క (కైక) మాటకొఱకు, గుణాంభోనిధి - మంచి గుణములకు సముద్రమువంటివాఁడయిన, రాముని - శ్రీరామమూర్తిని, పాసి - వదలి, శోకముతోడన్ - దుఃఖముతో, చనిపోవఁడా - చావఁడా? (చచ్చెను)

తా. భాస్కరా! వివేకములేక యాఁడుదాని మాట ననుసరించి నడచినయెడల నెంతటి గొప్పవాఁడయినను జెడిపోక మానఁడు. ఇందు సందేహము లేదు. దశరథుఁడు కైకమాట విని శ్రీరాముని నడవికిఁ బంపి యా దుఃఖముతోనే మరణించినాఁడు గదా?

చ. మును పొనరించుపాతక మ◆మోఘము; జీవులకెల్లఁబూని యా
వెనుకటి జన్మమం దనుభ◆వింపక తీఱదు; రాఘవుండు వా

---

85. దశరథుఁడు - కైకమాట.

దశరథునికిఁ గుమారులు నలుగురు - రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు. వీరు లేకలేక భగవత్ప్రసాదమునఁ గలిగిరి. భార్యలు ముగ్గురు - కౌసల్య, కైకేయి, సుమిత్ర అనువారు. వీరిలోఁ గైకమీఁదఁ బ్రేమ దశరథునకు మెండు. పుత్త్రులకు వివాహ మయిన పిమ్మట పెద్దకొడుకగు శ్రీరామునకుఁ బట్టాభిషేకముఁ జేయ నిశ్చయించెను. ప్రజ లామోదించిరి. కులగురు వగు వసిష్ఠుఁడు ప్రోత్సాహపఱచెను. తెల్లవాఱినఁ బట్టాభిషేకము. పట్టణ మలంకరింపఁబడెను. వేలకువేలు జనులువచ్చిరి. ఉత్సాహముతో నుండిరి. కైక దాసియగు మంథర దుర్బోధవలనఁ దనయింటికివచ్చిన దశరథుని నిర్బంధించి రెండు వరములయందు రాముని వనవాసము, భరతుని పట్టాభిషేకము వాంఛించెను. కాదనలేక యామాటల నాలకించి చేయఁబూనెను. శ్రీరాముఁడు తండ్రియాజ్ఞ నెఱిఁగి తమ్మునితోడను, భార్యతోను నడవి కరిగెను. దశరథుఁడు పెద్దకొడుకు కానకరుగఁ దా నా వియోగదుఃఖముచే మరణించెను. స్త్రీమాటలు విని నడచిన నిట్టి యనర్థములే కలుగును.

లినిఁబడనేసి తా మగుడ ♦ లీల యదూద్భవుఁడై, కిరాతుచే
వినిశిత బాణపాతమున ♦ వీడ్కొనఁడే తనమేను ? భా. 86

టీ. భాస్కరా! మును-ముందు జన్మమున, ఒనరించు పాతకము - చేసిన పాపము, అమోఘము - వ్యర్థముగానిది, జీవులకున్ + ఎల్లన్ - ప్రాణులకందఱకును, పూని - ప్రయత్నించి, ఆవెనుకటి జన్మమందు - రాఁబోవు పుట్టుకయందు, అనుభవింపక, తీఱదు - నశింపదు, రాఘవుండు - శ్రీరామమూర్తి, వాలిని, పడన్ + వేసి - చంపి, తాన్ - ఆ రాముఁడే, మగుడ - మరల, లీలన్ - వేడుకతో, యదూద్భవుఁడై - యదువంశమునఁబుట్టి, కిరాతుచేన్ - వేఁటకానిచేత, వినిశిత బాణపాతమునన్ - పదునుగల బాణముయొక్క దెబ్బచేత, తనమేనున్ - తనదేహమును, వీడ్కొనఁడే - వదలలేదా ? (వదలెను)

తా. భాస్కరా ! చేసిన పాపము వ్యర్థముగాఁబోదు. అది తప్పక మఱుజన్మమున ననుభవించియే తీఱవలెను. శ్రీరాముఁడు వాలిని బాణమునఁ గొట్టి పడవేయుటచేత, మరల యదువంశమున నవతరించి కిరాతుని బాణముచేతఁ దన దేహమును వదలినాఁడు గదా ?

---

86. శ్రీకృష్ణుఁడు - కిరాతుఁడు - శ్రీరాముఁడు - వాలి.

శ్రీరామచంద్రుఁ డరణ్యమున సీతను వెదకుచుఁ దిరుగుచుండెను. వానరరాజగు సుగ్రీవుని చెలిమికలిగెను. సుగ్రీవునకు వాలి యను సోదరుఁడు కలఁడు. తనకుఁగల్గిన సోదరుని బాధను దీర్పుమని సుగ్రీవుఁడు శ్రీరామునిఁగోరెను. శ్రీరాముఁడు వాలిని జంపఁబూని సోదరు లిరువురు యుద్ధము చేయుచుండఁ జెట్టుచాటుననుండి వాలిని గూలనేసెను. ఈ కార్యము చేయుటవలన శ్రీకృష్ణావతార సమయమునఁ గురుపాండవ యుద్ధానంతరము తా నవతరించిన కార్యములను దీర్చిన పిమ్మట నొకనాఁడు శ్రీకృష్ణుఁ డడవిలో సంచరించుచు నొకచోఁ బరుండియుండ నొక వేఁటకాఁడు బాణముతో గుఱిచూచి మృగభ్రాంతిచేఁ గొట్టెను. ఆ వేదన నెపమునఁ గృష్ణమూర్తి పరమపదముఁజనియెను. చేసినపని యెప్పుడైన ననుభవింపక తీఱదు.

ఉ. రాకొమరుల్ రసజ్ఞునిఁ దిరంబుగ మన్నన నుంచినట్లు, భూ
లోకమునందు మూఢుఁదమలోపల నుంపరు; నిక్కమేకదా?
చేకొని ముద్దుగాఁ జదువు చిల్కను బెంతురుగాక; పెంతురే
కాకము నెవ్వరైన; శుభకారణ! సన్మునిసేవ్య! భా. 87

టీ. శుభము కారణముగాఁ గలవాఁడా! సన్మునిసేవ్య! - మంచి మునులచే సేవింపఁదగినవాఁడా! భాస్కరా! రాకొమరుల్ - రాజకుమారులు, రసజ్ఞునిన్ - మంచి చెడ్డలను దెలిసినవానిని, తిరంబుగన్ - శాశ్వతముగ, మన్ననన్ - మర్యాదయందు, ఉంచినట్లు, భూలోకమునందు - భూమిమీఁద, మూఢున్ - అవివేకిని, తమలోపలన్ - తమ సమీపమున, ఉంపరు - ఉంచరు, నిక్కమే కదా? - నిజమే కదా? ముద్దుగాన్ - ప్రియముగా, చదువు చిల్కను - మాటలాడు చిలుకను, చేకొని - గ్రహించి, పెంతురు గాక - పోషింతురుగాని, ఎవ్వరైనన్, కాకమున్ - కాకిని, పెంతురే - పోషింతురా?

తా. భాస్కరా! రాజకుమారులు వివేకవంతుని శాశ్వతముగ గౌరవింతురుగాని, వివేకములేనివానిని తమ సమీపముననైన నుంచుకొనరు. ఇది నిజము; మనస్సునకుఁ బ్రియముగాఁ జదువునట్టి చిల్కను పెంతురేగాని, లోకులు కాకిని బెంతురా?

ఉ. లోకములోన దుర్జనులలోఁతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు; చేరినం గవయఁ జూతురు చేయుదురెక్కసక్కెముల్
కోకిలఁ గన్నచోట గుమిగూడియసహ్యపుఁగూఁతలార్చుచున్
గాకులు తన్నవే తఱిమి కాయము తల్లడమంద భా. 88

టీ. భాస్కరా! లోకములోనన్ - ప్రపంచమునందు, దుర్జనుల లోఁతున్ - చెడ్డవారియొక్క భావమును, ఎఱుంగక - తెలియక, సుశ్లోకుఁడు - మంచివాఁడు, చేరరాదు; చేరినన్ - చేరినచో, కవయన్ - కలియఁ

బడుటకు, మాతురు - ఆలోచింతురు, ఎక్కసక్కెములు - పరిహాసములు, చేయుదురు; కోకిలన్ - కోయిల యను పక్షిని, కన్నచోటన్ - చూచిన స్థలమునందు, కాకులు, గుమికూడి - గుంపుచేరి, అసహ్యపుఁ గూఁతలు - వినుటకు శక్యముగాని ధ్వనులను, ఆర్చుచున్ - కూయుచు, కాయము - దేహము, తల్లడము + అందన్ - శ్రమ పొందునట్లుగా, తఱిమి - వెంటఁబడి, తన్నవే - తన్నవా? (తన్నును)

తా. భాస్కరా! కీర్తిగలవాఁడు లోకములో దుర్మార్గుల భావమును దెలియక చేరరాదు. చేరినచో చుట్టుముట్టి ఎగతాళిచేసి తామమూరు చేయుదురు. కోయిలను జూడఁగానే కాకు లన్నియు గుమిగూడి వికారముగా వఱచుచుఁ దఱిమి తఱిమి శరీరము తల్లడిల్లినట్లు తన్నును గదా?

ఉ. లోను దృఢంబుగాని పెను♦లోభిని నమ్మి, యసాధ్యకార్యముల్
కానక పూనునే నతఁడు♦ గ్రక్కునఁ గూలును; నోటిపుట్టిపై
మానవుఁ డెక్కిపోవ నొక♦మాటు పుటుక్కున ముంపకుండునే,
దా నొకలోఁతునం గెడసి♦దానిఁ దరింపఁగలేక? భా. 89

టీ. భాస్కరా! లోను - మనస్సునందు, దృఢంబుగాని - స్థైర్యము లేని, పెనులోభిని - ఎక్కువ యాశగలవానిని, నమ్మి, అసాధ్య కార్యముల్ - చేయుటకు వీలులేని పనులను, కానక - తెలియక, పూనునేని - చేయుటకు మొదలుపెట్టిన యెడల, అతఁడు - అట్టివాఁడు, గ్రక్కునన్ - వెంటనే, కూలును - నశించును; ఓటిపుట్టిపైన్ - పగిలిపోయిన పడవ మీఁద, మానవుఁడు, ఎక్కి, పోవన్ - పోఁగా, ఒకమాటు - ఒక్కపర్యాయము, ఒక లోఁతునన్ - లోఁతయిన భాగమునందు, కెడసి - పడిపోయి (మునిఁగి), దానిన్ - ఆ ప్రవాహమును, తరింపఁగలేక - దాఁటలేక, తాన్ - ఆ పడవ, పుటుక్కునన్ - తటాలునన్, ముంపక + ఉండునే - ముంచఁగక యుండునా? (ముంచివేయును)

తా. భాస్కరా! ఎవఁడైనను మనస్సు స్థిరముగాలేని మనుష్యుని నమ్మికొని సాధ్యముగాని పనులను జేయుటకు మొదలుపెట్టరాదు. అట్లు చేయఁ

బూనినచో వెంటనే వాఁడు చెడిపోవును. పగిలిన పడవపైఁ గూర్చుండి నదిని దాఁటఁబూనినచో లోఁతుగా నుండుచోట పుటుక్కున నీటఁబడి, తారుమారై ముంచివేయుక యుండునా?

ఉ. వంచన యింతలేక యెటు♦వంటి మహాత్ముల నాశ్రయించినన్
గొంచెమె కాని, మేలు సమ♦కూడ దదృష్టము లేనివారికిన్;
సంచితబుద్ధి బ్రహ్మ నని♦శంబును వీఁపున మోఁచునట్టి రా
యంచకుఁ దమ్మితూండ్లు దిన♦నాయెఁగదా? ఫలమేమి? భా.

టీ. భాస్కరా! వంచన - మోసము, ఇంతలేక - కొంచెమయినను లేక, ఎటువంటి మహాత్ములన్ - ఎంతటి గొప్పవారిని, ఆశ్రయించినన్ - దగ్గఱఁ జేరినప్పటికిని, అదృష్టము లేనివారికిన్ - భాగ్యము లేనట్టివారికి, కొంచెమెకాని - అల్పమే కాని, మేలు సమకూడదు - సంపూర్ణముగా మేలు కలుగదు; సంచితబుద్ధిన్ - కుదుటుకొనిన మనస్సుతో, బ్రహ్మను - బ్రహ్మదేవుని, అనిశంబును - ఎల్లకాలము, వీఁపునన్ - వీఁపుమీఁద, మోఁచునట్టి, రాయంచకున్ - రాజహంసకు, తమ్మితూండ్లు - తామరతీఁగలు మాత్రమే, తిననాయెఁ గదా? - తినుట తప్పదాయె కదా? ఏమి ఫలము? - లాభమేమి? (లేదు)

తా. భాస్కరా! కపటము లేనివాఁడై గొప్పబుద్ధి గలిగి యెంత గొప్పవారి దగ్గఱఁజేరినను, అదృష్టము లేకయున్న మేలు కొంచెమేకాని, యెక్కువ లాభములేదు. పుట్టినది మొదలుకొని నిలుకడయైన బుద్ధితో బ్రహ్మదేవునిఁ దనవీఁపునఁ గూర్చుండఁబెట్టుకొని తాను వాహనమై మోయుచున్నను, రాజహంసకుఁ దామరతూఁడులే యాహారము గలిగెనేగాని, తృప్తిగా ఫలము గలుగక పోయినది గదా? ఆ యల్పఫలమువలన లాభ మేమి యున్నది?

ఉ. పట్టుచుఁ దండ్రి యత్యధమ♦వర్తనుఁ డైననుగాని, వానికిం
బుట్టిన పుత్రకుండు తన♦పుణ్యవశంబున దొడ్డ ధన్యుఁ డౌ

నెట్టన; మఱ్ఱివిత్తుమును♦పెంతయుఁ గొంచెము; దానఁ బుట్టునా
చెట్టు మహోన్నతత్వమును♦జెందదె శాఖల నిండి? భా. 91

టీ. భాస్కరా! వట్టుచున్ - చిక్కిపోవుచు, తండ్రి - నాయన, అత్యధమ వర్తనుఁడు - మిక్కిలి నీచమయిన నడవడి గలవాఁడు, ఐనను గాని - అయినప్పటికి, వానికిన్ - ఆ తండ్రికి, పుట్టిన పుత్త్రసంజు - కలిగిన కుమారుఁడు, తన పుణ్యవశంబునన్ - తానుజేసిన పుణ్యమునుబట్టి, దొడ్డధన్యుఁడు - మిక్కిలి గొప్ప కీర్తిగలవాఁడు, ఔన్ - అవును; ఎట్లు + అనన్ - ఎట్లనఁగా, మఱ్ఱివిత్తు, మునుపు - ముందుగా, ఎంతయున్ - మిక్కిలి, కొంచెము - చిన్నది, దానన్ - దానివలన, పుట్టునాచెట్టు - పుట్టిన యా మఱ్ఱిచెట్టు, శాఖలన్ - కొమ్మలచేత, నిండి - వ్యాపించి, మహోన్నతత్వమును - మిగులఁ బెద్దదిగానుండుటను, చెందదె - ఉండదా ? (ఉండును)

తా. భాస్కరా ! తండ్రి చిక్కిపోయి యెంత తక్కువవాఁడుగా నగుపడినను, పుట్టిన కుమారుఁడు మాత్రము, వాని భాగ్యముచేత మిగుల గొప్ప కీర్తిగలవాఁడయి, బలవంతుఁ డయియుండును. మఱ్ఱివిత్తనము చిన్నదేయయినను, దానికిఁ బుట్టిన చెట్టు కొమ్మలచే బలిసి మిక్కిలి పెద్దదయి యుండుట లేదా ?

చ. వలనుగఁ గానలందుఁ బ్రతి♦వర్షమునం బులి నాలుగైదు పి
ల్లలఁగను;దూడనొక్కటి ని♦లంగను ధేనువు రెండుమూఁడునేఁ
డుల; కటులైన బెబ్బులి కు♦టుంబములల్పములాయె; నాలమం
దలు గడువృద్ధిఁ జెందవె య♦ధర్మముఁ ధర్మముదెల్ప?భా. 92

టీ. భాస్కరా! కానలందున్ - అడవులయందు, వలనుగన్ - తగిన రీతిగా, ప్రతివర్షమునన్ - ఒక్కొక్క సంవత్సరమునందును, పులి, నాలుగు + ఐదు, పిల్లలన్ - బిడ్డలను, కనును - ఈనును, ఇలన్ - భూమియందు, ధేనువు - ఆవు, రెండు మూఁడు ఏఁడులకున్ - రెండుమూఁడేండ్లకు, దూడనొక్కటిన్ - ఒక్కదూడను, కనున్ - ఈనును, అటులయినన్ - ఆవిధ

ముగానైనను, బెబ్బులి కుటుంబములు - పెద్దపులుల కుటుంబములు, అల్పములు ఆయెన్ - కొంచెము అయినవి, ఆలమందలు - ఆవుల గుంపులు, కడున్ - మిగుల, వృద్ధిన్ + చెందవె - ఎక్కువ యగుచుండలేదా? (అభివృద్ధి బొందును) అధర్మమున్ - పులుల యన్యాయమును, ధర్మమున్ - ఆవుల న్యాయమును, తెల్పన్ - తెలుపుటకు.

తా. భాస్కరా! ప్రతిసంవత్సరము పెద్దపులులు నాలుగైదు పిల్లలను గనుచున్నవి. ఆవులో? రెండుమూఁడేండ్ల కొక పర్యాయము ఒక్క దూడను మాత్రము కనుచున్నవి. ఇట్లుండియుఁ బెద్దపులుల గుంపులు తగ్గిపోవుచున్నవి. ఆవుల గుంపులు ఎక్కువ యగుచున్నవి. అధర్మము నశించును, ధర్మము నశింపదు అనుట కిది యుదాహరణము.

చ. వలవదు క్రూరసంగతి య♦వశ్య; మొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియె కాక యెక్కువలు♦గూడవు;తమ్ములపాకులోపలం
గలిసినసున్నమించుకయుఁ♦గాకమఱించుకయెక్కువైనచోఁ,
నలుఁగడఁ జుఱ్ఱుచుఱ్ఱుమన♦నాలుక పొక్కకయున్నె? భా. 93

టీ. భాస్కరా! క్రూరసంగతి - చెడ్డ సహవాసము, అవశ్యము - ముఖ్యముగా, వలవదు - పనికిరాదు, ఒకప్పుడు - ఒకానొక సమయమునందు, చేయఁబడ్డచోన్ - చేసినయెడల, కొలఁదియె కాక - కొంచెమే కాని, ఎక్కువలు కూడవు - ఎక్కువ పనికిరాదు; తమ్ములపాకులోపలన్ - తమలపాకు నందుఁ, గలిసిన సున్నము - రాచిన సున్నము, ఇంచుకయున్ + కాక - కొంచెముగాక, మఱించుక - ఇంకఁ గొంచెము, ఎక్కువ + ఐనచోన్, నలుగడన్ - నాలుగు దిక్కులయందు, చుఱ్ఱుచుఱ్ఱుమనన్ - మంట పుట్టఁగా, నాలుక, పొక్కకయున్నె - పొక్కకుండునా? (పొక్కును)

తా. భాస్కరా! చెడ్డవాని సావాసము మొత్తముమీఁదఁ జేయరాదు. ఒకవేళఁ జేసినప్పటికిని, తగినంత కొద్దిగాఁ జేయవలయును. ఎక్కువ పనికి రాదు. తమలపాకులోఁ జేర్చునట్టిసున్నము కొంచెముగాఁ గాక యెక్కువ యయిన నోరు మంటపుట్టి నాలుక పొక్కుచుండలేదా?

ఉ. వానికి విద్యచేత సిరి ♦ వచ్చె నటంచును, విద్య నేర్వఁగాఁ
బూనినఁ బూనుఁగాక! తన ♦ పుణ్యము చాలక భాగ్యరేఖకుం
బూనఁగ నెవ్వఁడోపు; సరి♦పో చెవి పెంచునుగా; కదృష్టతా
హీనుఁడు కర్ణభూషణము ♦ లెట్లు గడింపఁగ నోపు భా. 94

టీ. భాస్కరా! వానికి - ఒకానొకనికి, విద్యచేతన్ - చదువువలన, సిరి - సంపద, వచ్చెను - చేరినది, అటంచును - అని, విద్యన్ - చదువును, నేర్వన్ - నేర్చుకొనుటకు, పూనినన్ - ప్రయత్నముచేయుటకు, పూనున్ + గాక - సిద్ధపడునుగాక, తన పుణ్యము - తనయొక్క మంచితనము, చాలక, భాగ్యరేఖకున్ - అదృష్టమునకు, పూనఁగన్ - పొందుటకు, ఎవ్వఁడు, ఓపున్ - శక్తిగలవాఁడగును; సరిపో - చక్కఁగా నుండునట్లు, అదృష్టతాహీనుఁడు - అదృష్టము లేనివాఁడు, చెవి పెంచును గాక - చెవిరంధ్రమును పెంచునుగాని, కర్ణభూషణములు - చెవుల సొమ్ములు (కమ్మలు, అంటుజోళ్ళు మొదలయినవి), ఎట్లు - ఏవిధముగా, గడింపఁగన్ - సంపాదించుటకు, ఓపున్ - శక్తిగలవాఁడగును? (కాఁడు)

తా. భాస్కరా! ఇతరుని యదృష్టమును జూచి వానికి విద్యవలన సంపద కల్గెనని యెంచి తాను విద్య నేర్చుకొనుటకు సిద్ధపడును గాని తనకుఁ దగిన పుణ్యములేక భాగ్యము రానిచో దానికేమి చేయఁగలఁడు? చెవులకు సొమ్ములు పెట్టుకొనుటకై తగినంత రంధ్రములను సరిపఱచుకొనవచ్చునుగాని కర్ణాభరణము లెట్లు సంపాదింపఁగలఁడు?

ఉ. సంతతపుణ్యశాలి నొక♦జాడను సంపద వాసిపోయి, తా
నంతటఁ బోక నెట్టుకొని♦యప్పటియట్ల వసించియుండు; మా
సాంతమునందుఁ జందురుని♦నన్నికళల్ పెడఁబాసి పోయినం
గాంతి వహింపఁడోటు తిరు♦గంబడి దేహమునింప భా. 95

టీ. భాస్కరా! సంతతపుణ్యశాలిని - శాశ్వతముగాఁ బుణ్యముగల వానిని, ఒకజాడను - ఒకానొకవిధముగా, సంపద - ఐశ్వర్యము, పాసి -

వదలి, పోయిన్‌తాను - ఆసంపద, అంతటఁబోక - ఆమీఁదట పోక, నెట్టుకొని - బలవంతముగాఁ బ్రవేశించి, అప్పటియట్ల - మునుపటివలె, వసియించియుండు - నిల్చియుండును; మాసాంతమునందున్ - నెలయొక్క కడపటి భాగమునందు (అమావాస్యనాఁడు), చందురునిన్ - చంద్రుని, అన్నికళల్ - కాంతులన్నియు, పెడఁబాసి - వదలి, పోయినన్ - పోయినప్పటికిని, తిరుగంబడి - మఱలినవై, దేహమునిండ, కాంతి - కళ, వహింపఁడోటు - పొందఁడా యేమి? (పొందును)

తా. భాస్కరా! పుణ్యాత్ముఁడగువానిని ఒకానొకవిధముగా సంపద వదలిపోయినను, అది యట్లేపోక మరల తనంతకుఁ దానే శ్రద్ధతో వచ్చి చేరఁ గలదు. అమావాస్యనాఁడు చంద్రుని కళ లన్నియు నశించి కాంతి లేక యుండినను, మరలఁ గ్రమముగా బింబమును జేరి ప్రకాశింపఁజేయు చుండుట లేదా?

చ. సకలజనప్రియత్వము నిజంబుగఁ గల్గిన పుణ్యశాలి కొ
క్కొకయెడ నాపదైనఁ దడవుండదు; వేగమె పాసిపోవుఁగా;
యకలుషమూర్తియైనయమృతాంశుఁడురాహువుతన్నుమ్రింగినన్
టకటక మానియుండఁడె దృఢస్థితి నెప్పటియట్ల భా. 96

టీ. భాస్కరా! సకలజనప్రియత్వము - జనులకందఱకును ప్రీతి కలిగియుండుట, నిజంబుగన్ - సత్యముగా, కల్గిన - ఉండిన, పుణ్యశాలికి - పుణ్యాత్మునకు, ఒక్కొకయెడన్ - ఒకానొకప్పుడు, ఆపద - కష్టము, ఐనన్ - కలిగినను, తడవు - చాలకాలము, ఉండదు, వేగమె - త్వరగా, పాసి - తొలఁగి, పోవున్ + కా - పోవునుకదా? అకలుషమూర్తి - మలినములేని రూపముకలవాఁడు, ఐన, అమృతాంశుఁడు - చంద్రుఁడు, రాహువు - రాహుగ్రహము, తన్నున్ - తనను, మ్రింగినన్ - మ్రింగినప్పటికిని, టకటక, కలవిలపాటును, మాని - వదలి, ఎప్పటియట్ల - పూర్వపురీతిని, దృఢస్థితిన్ - స్థిరముగా, ఉండఁడె - ఉండఁడా? (ఉండును)

తా. భాస్కరా! జనులకెల్లవారికిని ప్రియుఁడుగానుండిన పుణ్యాత్మునకు, ఒకానొకకాలమున, ఆపద వచ్చినను అది శాశ్వతముగా నుండదు.

త్వరగాఁ దప్పిపోవును. నిర్మలకాంతులు గలిగిన చంద్రుని రాహువు మ్రింగి నప్పటికిని, ఆ బాధ శీఘ్రముగాఁ బోయి యెప్పటివలె మరల కాంతులతోఁ బ్రకాశించుచున్నాఁడు గదా?

ఉ. సన్నుతకార్యదక్షుఁ డొక•చాయ నిజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు•నొండొకమే లొనరించు; సత్త్వసం
పన్నుఁడు భీముఁడాద్విజుల•ప్రాణము కావఁడె, యేకచక్రమం
దెన్నికగా బకాసురుని•నేపున రూపడఁగించి? భాస్కరా! 97

టీ. భాస్కరా! సన్నుత కార్యదక్షుఁడు - మెచ్చుకొనఁదగిన కార్యములను జేయుటయందు సామర్థ్యముగలవాఁడు, ఒకచాయ - కొంచెము

---

96. రాహువు - చంద్రుఁడు.

దేవతలును, రాక్షసులును అమృతముకొఱకై పాలసముద్రమును శ్రమపడి చిలికిరి. అమృతము సముద్రమునుండి యుద్భవించెను. ఆ యమృతమును బంచుకొనుటకై గొప్ప వివాద మారంభమయ్యెను. ఆ సమయమున శ్రీ మహా విష్ణువు మోహినీరూపంబున నవతరించి వారిని వీరిని మోసపుచ్చి యమృత కలశమును గ్రహించి దేవతలను వేఱుగ, రాక్షసులను వేఱుగఁ బంక్తులుగఁ గూర్చుండఁబెట్టి యమృతమును బంచుటకుఁ బ్రారంభించెను. ముందుగా దేవతల పంక్తిలోఁ బ్రారంభించి వడ్డించుచుండెను. అపుడు సింహిక కుమారుఁడు రాహు వను రాక్షసుఁడు తమ కమృతము దొరకదని యెంచి మెల్లగా మోసమున దేవతల పంక్తిలోఁ జేరి కూర్చుండి యుండెను. సూర్యచంద్రు లీ విషయమును విష్ణుమూర్తికిఁ దెలిపిరి. క్రమభంగము చేసిన రాహువును జక్రముతో విష్ణుమూర్తి తల నఱకెను. అమృతము సోకుటచే రాహువు చావక రెండు ముక్కలై బ్రదికెను. రాహువు, కేతువు అను నామధేయములతో పగబూని సూర్య చంద్రులను బాధించుచున్నాఁడు. రాహువు చంద్రునిఁ బట్టినపుడు చంద్రగ్రహణమనియు, కేతువు సూర్యుని బట్టినపుడు సూర్యగ్రహణమనియు పేరులు కలిగెను.

(ఒకప్పుడు), నిజప్రభ - తనమహిమ, అప్రకాశము + ఐ - వెలుఁగక యున్నదై, ఉన్నపుడు + ఐనన్, లోకులకున్ - లోకములోని వారికి, ఒండొక - ఒకానొక, మేలు - ఉపకారము, ఒనరించున్ - చేయును, సత్త్వసంపన్నుఁడు - బలవంతుఁడు అయిన, భీముఁడు, ఏకచక్రమునందు - ఏకచక్రపురమున, ఎన్నికగాన్ - మెచ్చుకొనునట్లు, బకాసురునిన్ - బకుఁడను రాక్షసుని, ఏపునన్ - మహిమతో, రూపు + ఆడఁగించి - చంపి, ద్విజుల ప్రాణమున్ - బ్రాహ్మణులయొక్క ప్రాణములను, కావఁడె - రక్షింపలేదా? (రక్షించెను)

తా. భాస్కరా! ఇతరులు మెచ్చునట్టి పనులఁ జేయువాని కొకానొక కాలమునఁ దన మహిమకు లోపము కల్గినప్పటికిని లోకులకు మేలే చేయు

97. భీముఁడు - బకాసురుఁడు.

పాండవులు లక్కయింటినుండి తప్పించుకొని వెడలి యడవులలోఁ దిరిగి తిరిగి శాలిహోత్రుఁడను మునియొద్ద ధర్మశాస్త్రముల నభ్యసించుచుండి తర్వాత వారిదగ్గఱ సెలవుపుచ్చుకొని మెల్లగా నడచి యేకచక్రపురముఁ జేరి యం దొక్క బ్రాహ్మణుని యింట నుండి భిక్షాటనముతో జీవితమును నడపుచు వేదాధ్యయనము చేయుచుండిరి. బకుఁ డను రాక్షసుఁ డేకచక్రపుర సమీపమున నుండు యమునానదీతీరమున నొక గుహాలో నివసించి యేకచక్రపురవాసుల బాధించుచుండెను. ఆ పురవాసులు బకాసురునితో నిల్వరుసగా నాహారమును బంపుట కంగీకరించి యట్లు చేయుచుండిరి. పాండవులు నివసించియున్న యింటివారి వంతు వచ్చెను. వారు దుఃఖాక్రాంతులై యుండిరి. ఈ విషయమును కుంతీదేవి తెలిసికొని భీముని బకాసురున కాహారము గొనిపోవుట కేర్పాటు చేసెను. భీముఁడు సంతుష్టిగ భుజించి యాహారశకటమును దోలుకొనిపోయి బకుని బిలిచి యా బండియందుండు నాహారమును దానే భుజించి యా బకాసురుని జంపి యేకచక్రవాసులను గాపాడి భయముఁ దీర్చెను. కాఁబట్టి గొప్పవాఁడు ఎంత యాపదలో నుండినను మేలే చేయఁజూచు నను నీతి తెలియ నగును.

చుండును. భీముఁడు అన్నదమ్ములతోను, దల్లితోను, బ్రాహ్మణ వేషమున నితరులకుఁ దెలియక భిక్షాటనము చేయుచు ఏకచక్రపురమునను౦డిన సమయమందుఁ గూడ బకాసురునిఁ జంపి ఆ యూరి బ్రాహ్మణులకు హితమేచేసి వారి ప్రాణములను గాపాడెను గదా?

చ. సరసగుణప్రపూర్ణునకు ♦ సన్నపు దుర్గుణ మొక్కవేళయం
దొరసిన, నిట్లు నీకుఁ దగు♦నో? యనిచెప్పిన మాననేర్చుఁగా;
బురద యొకించుకంత తముఁ♦బొందినవేళలఁ జిల్లవిత్తు పై
నొరసిన నిర్మలత్వమున ♦ నుండవె నీరము లెల్ల? భా. 98

టీ. భాస్కరా! సరసగుణ ప్రపూర్ణునకున్ - మంచిరసముతో (మంచి స్వభావముతో) నిండినవానికి, ఒక్క వేళయందున్ - ఒకానొక కాలమునందు, సన్నపుదుర్గుణము - కొంచెము చెడ్డగుణము, ఒరసినన్ - వ్యాపించినయెడల, ఇట్లు, నీకున్, తగునో - తగునా? అని, చెప్పినన్, మానన్ - వదలుటకు, నేర్చున్ + కా - తెలియును గదా? నీరములెల్లన్ - జలములన్నియును, ఒకించుకంత - కొంచెము, బురద, తమున్ - ఆ నీటిని, పొందిన వేళలన్ - చేరిన సమయమునందు, చిల్ల విత్తు - చిల్లగింజ, పైన్ - నీటిమీఁద, ఒరసినన్ - రాచఁగా, నిర్మలత్వమునన్ - మలినములేక, ఉండవె - ఉండవా? (ఉండును)

తా. భాస్కరా! మంచి రసవంతుఁడయినవానికి ఒకానొక కాలమున కొంచెము చెడ్డగుణము కలిగినను, తగునా యీ గుణమని హితము చెప్పిన సులభముగా వదలఁగలఁడు. నీళ్లు కాలమునుబట్టి యొకానొకప్పుడు బురదతోఁ గూడినచో చిల్లగింజ పైన రాచినయెడల బురదయంతయు పోయి నిర్మలమగుచుండలేదా?

చ. సరసదయాగుణంబుగల♦జాణమహింగడునొచ్చియుండియుం
దటుచుగ వాని కాసపడి, ♦ డాయఁగవత్తురు లోకు;లెల్లనం,

జెఱకురసంబు గానుఁగను • జిప్పిలి పోయినమీఁదఁ బిప్పియై
ధరఁబడియున్నఁ జేరవె•ముదంబునఁ జీమలు పెక్కు భా. 99

టీ. భాస్కరా! సరస దయాగుణంబు - సరసముతోఁ గూడిన దయ గల, జాణ - నేర్పుగలవాఁడు, మహిన్ - భూమియందు, కడున్ - మిగుల, నొచ్చియుండియున్ - నొప్పి పొందియున్నప్పటికిని, తఱుచుగన్ - సాధారణముగా, వానికిన్ - ఆ దయగలవానికొఱకు, ఆసపడి - కోరి, డాయఁగన్ - సమీపించుటకు, లోకులు - జనులు, వత్తురు; ఎట్లు + అనన్, చెఱకు - చెఱకు యొక్క, రసంబు - రసము, గానుఁగను - గానుగునందు, చిప్పిలిపోయిన మీఁద - కారిపోయినతర్వాత, పిప్పియై - సారములేనిదై, ధరన్ - భూమిమీఁద, పడియున్నన్, ముదంబునన్ - సంతోషముతో, పెక్కుచీమలు - చీమలగుంపులు, చేరవె - చేరవా? (చేరును)

తా. భాస్కరా! మంచి మనస్సుగలవాఁడు దయావంతుఁడగు నేర్పరి తాను నొప్పిపడియున్నప్పటికిని లోకులు వానిని మిక్కిలి ప్రీతితో సమీపింతురు. చెఱకు గానుఁగలోఁ బడి రసమంతయుఁ బోయి నేలమీఁదఁ బిప్పియై పడియుండినను, చీమలు సంతోషముతోఁ జేరుచున్నవిగదా?

ఉ. సారవివేకవర్తనల•సన్నుతి కెక్కినవారిలోపలం
జేరినయంత మూఢులకుఁ•జేపడ దానడ; యెట్టులన్నఁ; గా
సారములోన హంసముల • సంగతినుండెడి కొంగపిట్ట కే
తీరునఁగల్గనేర్చునుద•దీయగతుల్ దలపోయఁ భా. 100

టీ. భాస్కరా! సారవివేక వర్తనలన్ - శ్రేష్ఠమయిన తెలివిగల నడవడులచేత, సన్నుతికిన్ - పొగడ్తకు, ఎక్కినవారి లోపలన్ - వచ్చిన వారియందు, చేరినయంత - చేరఁగానే, మూఢులకున్ - తెలివిలేనివారికి, ఆ నడ - ఆ నడవడి, చేపడదు - లభింపదు; ఎట్టులు + అనన్ - ఎట్లనఁగా, కాసారములోనన్ - మడుఁగులోపల (కొలఁకునందు), హంసముల సంగతిన్ - హంసలయొక్క సహవాసమునందు, ఉండెడి - ఉండునట్టి, కొంగ పిట్టకున్ -

కొంగకు, ఏ తీరునన్ - ఏ విధముగా, తలపోయన్ - ఆలోచన చేయఁగా, తదీయగతుల్ - ఆ హంసల నడకలు, కల్గన్ + నేర్చును - కలుగఁగలవు ? (కలుగవు)

తా. భాస్కరా! మంచి తెలివిగల నడవడిగలవారితోను, ప్రఖ్యాతి కెక్కినవారితోను జేరఁగానే, బుద్ధిహీనులకు వారి నడవడి రాఁజాలదు. ఎట్లనఁగా, కొలఁకునందు హంసల సహవాసముతో నుండిన కొంగకు ఏ విధముగా వాని నడవడి కలుగఁగలదు ?

ఉ. స్థానము తప్పివచ్చునెడఁ♦దా నెటువంటి బలాఢ్యుఁడున్ నిజ
స్థానికుఁ డైనయల్పుని క♦తంబున నైనను మోసపోవుఁగా;
కానలలోపలన్ వెడలి ♦ గంధగజం బొకనాఁడు నీటిలోఁ
గానక చొచ్చినన్ మొసలి♦కాటున లోఁబడ దోటు. భా. 101

టీ. భాస్కరా! స్థానము - తనచోటు, తప్పి - వదలి, వచ్చునెడన్ - వచ్చిన సమయమునందు, ఎటువంటి బలాఢ్యుఁడున్ - ఎంత బలవంతుఁడును,

101. గజేంద్రుఁడు - బలము - స్థలము.

పూర్వకాలమున నొక యేనుఁగుల రాజు తన బలఁగముతోఁగూడ నరణ్యమున విహరింపఁబోయెను. తిరిగి తిరిగి యలసి మడుఁగునందు జలక్రీడలాడఁ దలఁచి మడుఁగుఁ బ్రవేశించెను. స్వేచ్ఛావిహారములఁ గావించెను. అందొక్క మొసలి యా యేనుఁగు సంచరించుటఁ గాంచి దాని కాలిని గట్టిగాఁ బట్టుకొనెను. ఏనుఁ గాపట్టును వదలించుకొనవలయునని యెంతయుఁ బ్రయత్నించెను. మొసలి పట్టు వదలలేదు. వేయి వత్సరము లా కరిమకరములకుఁ బోరాటము జరిగెను. తుదకు గజేంద్రుఁడు శ్రీ మహావిష్ణువును గూర్చి మొఱపెట్టుకొని యా బాధనుండి విముక్తిని, ముక్తిని బొందెను. ఆ యేనుఁగు ఇంద్రద్యుమ్నుఁడను రాజు. మకరము హూహూ నామ గంధర్వుఁడు. వీరు శాపవశమున నిట్లయిరి. మొత్తముమీఁద నిందు స్థానబలముగాక తనబల ముపయోగింపదను నీతి గలదు.

తాను, నిజస్థానికుఁడు - తన స్థానమునందున్నవాఁడు, ఐన + అల్పుని కతంబునన్ + ఐనను - అయిన నీచునిచేత నైనను, మోసపోవుఁగా + కా - మోసపోవును కదా? గంధగజంబు - మదించిన యేనుఁగు, కానల లోపలన్ - అడవులలోనుండి, వెడలి - బయలుదేఱి, ఒకనాఁడు, నీటిలోన్, కానక - తెలిసికొనలేక, చొచ్చినన్ - ప్రవేశింపఁగా, మొసలికాటునన్ - మొసలియొక్క దెబ్బకు, లోఁబడదోటు - లోఁబడక యుండునా? (లోఁబడును)

తా. భాస్కరా! ఎవఁడైనను తనచోటువదలి వచ్చినప్పుడు బలమెంత యున్నను, స్వస్థలము వదలని నీచునిచేత మోసపోవునుగదా? మదపుటేనుఁగు కానలలోనుండి బయల్వెడలి నీటిలోనికిఁ దెలియక పోయినచో నంమఁగల మొసలిచే దెబ్బతిని లోఁబడక పోవునా?

చ. సిరి గలవాని కెయ్యెడలఁ ♦ జేసినమే లది నిష్ఫలం బగున్;
నెఱి గుఱి గాదు; పేదలకు♦నేర్పునఁ జేసిన సత్ఫలం బగున్;
వఱపున వచ్చి మేఘుఁ డొక ♦ వర్షము వాడినచేలమీఁదటం
గురిసినఁ గాక; యంబుధులఁ♦గుర్వఁగ నేమిఫలంబు భా. 102

టీ. భాస్కరా! సిరిగలవానికిన్ - ధనవంతునకు, ఎయ్యెడలన్ - ఏ సమయమందైనను, చేసిన, మేలు, అది, నిష్ఫలంబు - ఉపయోగము లేనిది, అగున్, నెఱి - సంపూర్ణమయిన, గుఱికాదు - లక్ష్యము కాదు, పేదలకున్ - బీదవారికి, నేర్పునన్ - చక్కని శక్తితో, చేసినన్ - మేలుచేసిన, సత్ఫలంబు - మంచిలాభము, అగున్; మేఘుఁడు - మేఘుఁడు, వఱపునన్ - వాన లేని సమయమునందు (పదునులేని కాలమున), వాడిన చేలమీఁదటన్ - వాడిపోయిన పొలములమీఁద, ఒకవర్షము - ఒక వాన, కురిసిన్ + కాక - కురిసిననే కాని, అంబుధులన్ - సముద్రములయందు, కుర్వఁగన్ - కురియుఁగా, ఏమిఫలంబు - ఏమి యుపయోగము? (ఉపయోగము లేదు)

తా. భాస్కరా! దాతయగువాఁడు సంపదగలవానికి మేలుచేసిన నే లాభము కలుగదు. బీదవారికి మేలుచేసినచో మంచి ఫలము కలుగును. ధన

వంతున కిచ్చిన దానమున అలక్ష్యమేగాని గౌరవముకూడ నుండదు. ఎట్లనఁగా, వానలేక పదునుతగ్గి వాడిపోవుచున్న నేలమీఁద వర్షము మేఘుఁడు వర్షించిన నుపయోగపడును గాని, సముద్రములో వర్షము వర్షించిన నేమి యుపయోగము కలుగును ?

చ. సిరి వలెనేని సింహగుహ◆చెంత వసించినఁ జాలు;సింహముల్
కరుల వధింపఁగా నచటఁ◆గల్గును దంతచయంబుముత్యముల్;
హరువుగ నక్కబొక్కకడ◆నాశ్రయ మందిన నేమి గల్గెడుం
గొరిసెలు దూడతోఁకలును◆గొమ్ములు నెమ్ములుగాక; భా. 103

టీ. భాస్కరా! సిరి - సంపద, వలెనేని - కావలసినయెడల, సింహగుహచెంతన్ - సింహముయొక్క గుహదగ్గఱ, వసించినన్ - నివాసముచేసిన, చాలున్ - సరిపోవును, సింహములు, కరులన్ - ఏనుఁగులను, వధింపఁగాన్ - చంపఁగా, అచటన్ - ఆ గుహలయందు, దంతచయంబు - దంతముల సముదాయము, ముత్యముల్ - ఏనుఁగు కుంభస్థలములందలి ముత్యములు, కలుగును - దొరకును, హరువుగన్ - బాగుగా, నక్కబొక్కకడన్ - నక్కలు చేసిన బొరియల దగ్గఱ, ఆశ్రయము + అందినన్ - చేరియుండినయెడల, గొరిసెలు - గిట్టలు, దూడ తోఁకలును, కొమ్ములు, ఎమ్ములు - ఎముకలు, కాక - తప్ప, ఏమి కల్గెడున్ - ఏమి దొరకఁగలవు ? (ఏమియు దొరకవు)

తా. భాస్కరా! గొప్పవారిదగ్గఱఁ జేరినచో మేలు కలుగునుగాని నీచులదగ్గఱఁజేరిన నే లాభమును గల్గదు. సింహ ముండు గుహదగ్గఱఁజేరి కష్టపడి యైనను నివసించి యుండినచో సింహములు ఏనుఁగులను జంపఁగాఁ బడిన ఏనుఁగు దంతములు, ఏనుఁగుల కుంభస్థలములయందలి ముత్యములును లభించును. నక్కబొక్క దగ్గఱఁజేరి శ్రద్ధతోఁ గాచుకొనిన యెడల చచ్చిన దూడల తోఁకలు, గిట్టలు, ఎముకలు మాత్రమే దొరకును గాని లాభ మేమయిన నుండదు గదా ?

చ. స్థిరతర ధర్మవర్తనఁ బ్ర◆సిద్ధికి నెక్కినవాని నొక్కము
ష్కరుఁడతినీచవాక్యములఁ◆గాదనిపల్కిన,నమ్మహాత్ముఁడుం

గొఱంత వహింపఁ డయ్యెడ; నకుంఠితపూర్ణ సుధాపయోధిలో
నరుగుచుఁ గాకి రెట్ట యిడినంతన నేమి కొఱంత? భా. 104

టీ. భాస్కరా! స్థిరతర - మిక్కిలి దిట్టముగానుండు, ధర్మవర్తనన్ - న్యాయమయిన నడవడితో, ప్రసిద్ధికిన్ - ప్రఖ్యాతికి, ఎక్కినవానిన్ - కీర్తిని పొందినట్టివానిని, ఒక్క ముష్కరుఁడు - ఒక దుర్మార్గుఁడు, అతి నీచవాక్యములన్ - పనికిరాని మాటలతో, కాదు + అని, పల్కినన్ - మాటలాడినను, అమ్మహాత్ముఁడున్ - ఆ గొప్పబుద్ధి గలవాఁడు కూడ, అయ్యెడన్ - ఆ సమయమున, కొఱంత - లోపమును, వహింపఁడు - పొందఁడు; అకుంఠిత పూర్ణ సుధాపయోధిలోన్ - సంపూర్ణముగానుండు అమృత సముద్రమునందు, కాకి, రెట్టఇడినంతనన్ - మలము వదలినంత మాత్రమున, ఏమికొఱంత - ఏమి తక్కువయుండును? (తక్కువలేదు)

తా. భాస్కరా! నిలుకడగానుండు మంచి నడవడితోఁ బేరుపొందిన వానిని ఒకానొక దుర్మార్గుఁడు నిందించి త్రోసివేసి మాటలాడినప్పటికిని ఆ ధర్మాత్మునకు ఏమియు కొఱఁతపడదు. ఆ ధర్మాత్ముఁడు కూడ నప్పుడు మనస్సులో నేకొఱంతయును పొందఁడు. నిండి పూర్ణముగా నుండిన యమృత సముద్రమునందు కాకి యాకసమునఁ బోవుచు మలము వదలిన (రెట్టవేసిన) లోపము కాదు గదా?

చ. స్ఫురతరకీర్తిమంతులగు పుత్త్రులఁ గాంచినఁగాక, మూఢము
ష్కరులఁ గనంగఁ దేజము గల్గవుగా? మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శుభస్థితిఁ బెట్టినఁగాక, గాజుటుం
గరములు పెట్టినందున వికాసము కల్గునటయ్య? భా. 105

టీ. భాస్కరా! స్ఫురతర - మిక్కిలి యెక్కువగాఁ బ్రకాశించునట్టి, కీర్తిమంతులు - పేరు (యశస్సు) గలవారు, అగు పుత్త్రులన్ - అయిన కొడుకులను, కాంచినన్ + కాక - కనినచేగాని, మూఢముష్కరులన్ - వివేకములేని దుర్మార్గులను, కనంగన్ - కనినయెడల, తేజములు -

ప్రభావములు, కల్గవుగా - కలుగవుకదా? మణి - రత్నములు, కీలిత - చెక్కఁబడిన, అంగుళి + ఆభరణములు - ఉంగరములు, శుభస్థితిన్ - మేలుగా, పెట్టినన్ + కాక - ధరించిననేకాని, గాజుటుంగరములు - గాజుతోఁ జేయఁబడిన ఉంగరములు, పెట్టినందునన్ - ధరించినందువలన, వికాసము - కాంతి, కల్గునటయ్యా - కలుగఁగలదా? (కలుగదు)

తా. భాస్కరా! శ్రేష్ఠములయిన గుణములచేఁ బేరు పొందఁదగిన కొడుకులు పుట్టిననే కీర్తిప్రతిష్ఠలు వచ్చును గాని, తెలివిలేని దుష్టులు పుట్టిన యెడల కీర్తిప్రతిష్ఠలు రావు. రత్నములు చెక్కిన యుంగరములు ధరించిననే వ్రేళ్ళకుఁ బ్రకాశము, సొగసు కలగును గాని, గాజురాళ్ళ ఉంగరములు ధరించిన యందచందములు గలుగవు కదా?

ఉ. సేనగ వాంఛితాన్నము భుజింపఁగలప్పుడు గాక, లేనిచో
మేనులు డస్సియుంట నిజమేకద దేహుల, కగ్నిహోత్రుఁడౌ
నే నిజభోజ్యముల్ గుడుచునేనియుఁ బుష్టివహించు; లేనినాఁ
డూని విభూతిలో నణఁగియుండఁడె తేజము తప్పి? భా. 106

టీ. భాస్కరా! సేనగ - అధికముగ, వాంఛిత + అన్నమున్ - ఇష్టపడిన ఆహారమును, భుజింపఁగలప్పుడు - తినఁగలిగినప్పుడు, కాక - తప్ప, లేనిచో - అట్టి తిండిలేని సమయమునందు, మేనులు - దేహములు, డస్సియుండుట - అలసట పొందియుండుట, దేహులకు - ప్రాణులకు, నిజమే - సత్యమే, కదా? అగ్నిహోత్రుఁడు + ఔన్ + ఏని - అగ్నిదేవుఁడయినప్పటికిని, నిజభోజ్యముల్ - తాను తినఁదగిన యాహారములను, గుడుచున్ + ఏనియున్ - తినిననేగాని, పుష్టి - బలమును, వహించున్ - పొందును, లేనినాఁడు - తనకుఁదగిన యాహారము లేని దినమునఁదు, తేజము - ప్రకాశము, తప్పి - వదలి, విభూతిలోన్ - బూడిదయందు, అణఁగి తగ్గి, ఉండఁడె? - ఉండలేదా? (ఉండును)

తా. భాస్కరా! లోకములో నెవరయినను, బాగుగాఁ దృప్తిగా భోజనము దొరికి తినినప్పుడే గాని, తిండిలేని కాలమున దేహము అలసట

పొంది శక్తిలేక తగ్గియుందురు; ఇది నిజము. అగ్నిదేవుఁడు సమస్తము భుజించువాఁ డయినను, తగిన సమిధలు ఆహుతిగలయప్పుడే నుండి ప్రకాశించును గాని, యేమియులేని సమయమునందు కాంతితగ్గి బూడిదలో నణఁగి యుండునుగదా ?

ఉ. హాళి నిజప్రబుద్ధి తిర♦మైనవిధంబునఁ బెట్టుబుద్ధు లా
వేళల కంతెకాని, మఱి♦వెన్కకు నిల్వవు; హేమకాంతియె
న్నాళుల కుండుఁగాని, యొక♦నాఁడు పదంపడి సానఁబట్టినన్
దాళకయుండునే యినుప ♦ తాటకుఁ జాయలుపోక భా. 107

టీ. భాస్కరా! హాళిన్ - శ్రద్ధతో, నిజప్రబుద్ధి - తనకుఁ గలుగుచున్న శ్రేష్ఠమయిన తెలివి, తిరము - స్థిరము, ఐనవిధంబున - ఐనట్లు, పెట్టుబుద్ధులు - ఇతరులు నేర్పునట్టి బుద్ధులు, ఆవేళలకున్ - ఆ చెప్పిన కాలములకే, అంతెకాని - అంతియేతప్ప, మఱి వెన్కకున్ - తరువాతి కాలమునకు, నిల్వవు - నిలిచియుండవు; హేమకాంతి - బంగారముయొక్క ప్రకాశము, ఎన్నాళులకున్ - ఎన్నిదినముల కయినను, ఉండున్ + కాని, ఇనుపతాటకున్ - ఇనుపఱేకునకు, ఒకనాఁడు - ఒకదినము, పదంపడి - బాగుగా, సానఁబట్టినన్ - కాంతివచ్చునట్లు సానఁబట్టినను, చాయలు పోక - కాంతులు నశింపక, తాళుక యుండునే - నిలిచియుండునా ? (ఉండదు)

తా. భాస్కరా ! ఎవని కయినను స్వయముగాఁ బుట్టిన బుద్ధి స్థిరముగా నిలిచియుండునుగాని, యొకరు చెప్పిన బుద్ధులు నిలిచి యుండవు. ఒకదినమంతయు మెఱుఁగుపెట్టినను ఇనుపఱేకునకు కాంతి కొంచెము కాలమే యుండును గాని, బంగారున కున్నట్లు స్థిరముగా నిలిచి యుండదు. (బంగారుకు పెట్టిన మెఱుఁగు ఎన్నిదినములయినను నుండును. ఇనుమునకుఁ బెట్టిన కాంతి కొంచెము సేపుమాత్రమే యుండును)

ఉ. హీనకులంబునందు జని • యించినవారికి సద్గుణంబు లె
న్నేనియుఁ గల్గియున్న, నొక • నేరముచెందకపోదు; పద్మముల్
భూనుతిఁగాంచియున్ బురదఁ • బుట్టుటవల్ల సుధాకరోదయం
బైన నసహ్య మొందవె ప్రి • యంబునఁజూడఁగలేక భా. 108

టీ. భాస్కరా! హీనకులంబునందు - తక్కువ కులములోన, జనియించిన వారికిన్ - పుట్టినవారికి, సద్గుణములు, ఎన్నేనియున్ - ఎన్నియైనను, కల్గియున్నన్ - ఉండినప్పటికిని, ఒక నేరము - ఒక తప్పు; చెందక పోదు - కలుగకపోదు; పద్మముల్ - కమలములు, భూనుతిన్ - లోకమునందు పొగడ్తను, కాంచియున్ - పొందికూడ, బురదన్ - అడుసులో, పుట్టుట వల్లన్ - పుట్టినందువలన, సుధాకర - చంద్రుఁడు, ఉదయంబు + ఐనన్ - ఉదయించినప్పటికిని, ప్రియంబునన్ - ఇష్టముతో, చూడఁగలేక - చూడలేక, అసహ్యము - ఓర్పులేకుండుటను, పొందవె - పొందవా? (పొందును)

తా. భాస్కరా! నీచజాతియందుఁ బుట్టినవారి కెన్ని మంచి గుణము లుండినను నొక తప్పు మాత్రము తప్పక యుండకపోదు. కమలములు ఎంత ప్రకాశము గలిగి ప్రఖ్యాతి కెక్కియుండినను బురదయందుఁ బుట్టుటవలనఁ జంద్రుఁ డుదయింపఁగానే చూడలేక ముడుచుకొని తమ రోఁత గుణమును జూపుచున్నవి కదా?

ఉ. ఇంచుక నేర్పు చాలక వి • హీనతఁ జెందిన నాకవిత్వమున్
మించు వహించె నీకతన • మిక్కిలి; యెట్లనఁ, దోలుబొమ్మలన్
మంచివివేకి వానితెర • మాటుననుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే? జనుల • డెందమునింపవె ప్రీతి? భా. 109

టీ. భాస్కరా! సూర్యుఁడా! ఇంచుక - కొంచెమయినను, నేర్పు - చమత్కారము, చాలక - లేక, విహీనతన్ - తక్కువతనమును, చెందిన -

పొందినట్టి, నా కవిత్వముఁ - నాయొక్క పద్యరచనకూడ, నీకతనఁ - నీ పేరున వ్రాయుటవలన, మిక్కిలి - ఎక్కువగా, మించు - ప్రకాశమును, వహించెఁ - పొందినది, ఎట్లు + అనఁ - ఎట్లనఁగా, మంచివివేకి - ఎక్కువ నేర్పు గలవాఁడు, తోలుబొమ్మలఁ, తెరమాటునఁ - తెరయొక్క చాటునందు, ఉండి - ఉన్నవాఁడై, ప్రశస్తరీతిఁ - చక్కని పద్ధతితో, ఆడించినఁ- ఆడింపఁగా, ఆడవే - నాట్యమాడుటలేదా? జనుల డెందముఁ - చూచునట్టి వారి మనస్సును, ప్రీతిఁ - సంతోషమును, నింపవె - నిండింపవా? (నిండించును)

తా. భాస్కరా! కొంచె మయిన చాతుర్యము లేనట్టి నాకవిత్వము నీపేరున వ్రాయుటవలనఁ దమ కరుణచే నెక్కువ ప్రభావమును, మెప్పును బొందినది. ఎట్లనఁగా తోలుబొమ్మలను నేర్పుగలవాఁడు తెరచాటుననుండి నేర్పుతో నాడించినచో బాగుగా నాటాడి జనుల మనస్సులకు సంతోషమును గలిగించుచున్నవి కదా?

కావ్య-పురాణతీర్థ, విద్వాన్ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మచే
రచియింపఁబడిన సరళార్థ బోధినీ టీకాతాత్పర్యము

స ం పూ ర్ణ ము

# రమ్యమైన రాయల ప్రచురణములు

| | | |
|---|---|---|
| కృష్ణ శతకము (టీకా తాత్పర్యము, గ్లేజు కాగితము) | .... | 0- 4-0 |
| సుమతి శతకము ,, ,, | .... | 0- 4-0 |
| కుమారీ శతకము ,, ,, | .... | 0- 4-0 |
| కుమార శతకము ,, ,, | .... | 0- 4-0 |
| బాలరామాయణము ,, ,, | .... | 0- 4-0 |
| నీతిశాస్త్రము (తాత్పర్యము, పాకెట్ సైజు),, | .... | 0- 4-0 |
| వేమనశతకము (టీకా తాత్పర్యము, గ్లేజు కాగితము) | .... | 0- 4-0 |
| దాశరథిశతకము (నామరామాయణసహితము) | .... | 0- 8-0 |
| భాస్కరశతకము (పురాణకథలు చేర్చఁబడినది) | .... | 0-10-0 |
| రుక్మిణీకల్యాణము (టీకా తాత్పర్యము, గ్లేజు కాగితము) | .... | 0-10-0 |
| గజేంద్రమోక్షము ,, ,, | .... | 0-10-0 |
| నరసింహశతకము ,, ,, | .... | 0-12-0 |
| ఆంధ్రనామ సంగ్రహము (టీకా వివరణసహితము) | .... | 0-12-0 |
| అమరకోశము (ప్రథమకాండము, సటీకా) | .... | 0-12-0 |
| నలచరిత్రము, ద్విపదకావ్యము, చక్కనికూర్పు | .... | 1- 0-0 |
| నేతాజీ సుభాసచంద్రబోసు చరిత్రము (హరికథ) | .... | 0-10-0 |
| సమాసాలంకార ఛందోదర్పణము | .... | 1- 0-0 |
| బాలవ్యాకరణము-వివరణ, అనుక్రమణికా సహితము | .... | 1- 4-0 |
| భగవద్గీత, తాత్పర్యము (గ్లేజు, క్యాలికోబైండు) | .... | 2- 0-0 |
| భగవద్గీత, పెద్దచ్చు, నిత్యపారాయణమునకు | .... | 0- 8-0 |
| వీరగాథలు (చక్కని 6 పురాణ, నవీన కథలు) | .... | 0- 8-0 |
| నీతిచంద్రిక (పరవస్తు చిన్నయ సూరి విరచితము) | .... | 0-12-0 |
| పంచతంత్రము, వచనకావ్యము, సులభశైలి | .... | 0-12-0 |
| రాయల జం డిక్షనరీ | .... | 5- 0-0 |
| శ్రీమదాంధ్రభాగవతము, సంపూర్ణ ప్రతి, క్యాలికో | .... | 12- 0-0 |
| ,, మొదటి సంపుటము ,, | .... | 7- 8-0 |
| ,, రెండవ సంపుటము ,, | .... | 7- 8-0 |
| ,, దశమస్కంధము | .... | 4- 0-0 |

రాయలు అండ్ కో., 32, నారాయణముదలి వీథి, మద్రాసు.